ఓం

శ్రీ నారసిమ్హా సద్గుర వేనమః.

---

సర్వ వేదాంత పరమరహస్యంబగు,

# కైవల్యామృత మోక్ష గ్రంథము.



ఇది,

సకల ముముక్షు జనులకు అత్యంతోపకారముగ

శ్రీమద్బ్రహ్మాద్వైత సిద్ధాంత నిర్ధారణులైన

అన్నావధూత స్వాములవారి శిష్యుఁడు,

వేంకట చిదానంద యోగిచే

రచియింపఁబడి,



చెన్నపట్టణము

ప్రాతచాకలపేటయందుండు

పమ్మి - త్యాగరాయసెట్టిగారిచే

స్వకీయ

శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1925



 [వెల 8 అణాలు.



ఓం

కైవల్యామృత మోక్షగ్రంథ

# విషయసూచిక.



విషయసూచిక సంపూర్ణము.



సర్వవేదాంత పరమరహస్యంబగు, "కైవల్యామృత మోక్షగ్రంథము." ౯ ప్రకరణములు శ్రీబృహద్వాశిష్ఠ సిద్ధాంత నిర్ధారణములైన, అన్నావధూత స్వాములవారిశిష్యుఁడు, వేంకట చిదానంద యోగిచే రచియింపం బడినది. ౦-౮-౦
సాకినీమాహాత్మ్యము. ద్విపద ౦-౮-౦
భగవద్గీత తాత్పర్యసహితము. ౦-౧౦-౦
పాతంజలయోగశాస్త్రము:— మూలసూత్రములు, తెనుఁగు తాత్పర్యవిశేషార్థములతో. ౧-౦-౦
ప్రకృతిపురుష సంయోగ రహస్యబోధిని. ౦-౩-౦
మహాద్వైతబోధిని. ౦-౨-౦
అద్వైతామృతబోధిని. ౦-౨-౦
సూక్ష్మమోక్షమార్గము ౦-౫-౦
అనుభవానందదీపిక. ౦-౬-౦
నాగభూషణ తత్వరహస్యములు ౦-౧-౦
జీవతత్త్వప్రబోధకుసుమావళి.— తారక సాంఖ్య,అమనస్క-భావములు ౩౬౪ పద్యములు. ౦-౩-౦
ప్రజ్ఞాన బ్రహ్మబోధామృత తత్త్వ సంకీర్తనలు. ౦-౪-౦
గుప్తపురాణబోధిని. ౦-౩-౦
మిక్కిలి ప్రియమైన వస్తువేదో వాటిని గూర్చి లెక్చరు. ౦-౨-౦
సహజామనస్కానుభవబోధిని. ౦-౨-౮
వివేక సందర్భరత్నావళియును, జీవేశ్వర సంయోగ రహస్యము. ౧-౦-౦
కాశీయాత్రప్రకాశిక. ౦-౬-౦
మారీమహామ్మారీవిలాసము. ౦-౨-౦
స్వరచింతామణి. ౧-౮-౦
పాండురంగ నక్షత్రమాలిక ౦-౦-౬
శ్రీపండరీపుర - పాండురంగ భజనకీర్తనలు ౦-౨-౬

శ్రీపరిపూర్ణ బోధాచలకీర్తనలు - వచన కావ్యసహితము. ౦-౨-౦
నిర్గుణాత్మజ్ఞానసంయోగకందార్థరత్నావళియును, అచల ప్రబోధము. ౦-౬-౦
క్షేమ.ధర్మము.— వచనము. ౦-౧౦-౦
రాజయోగసారము వచనము. ౦-౨-౦
తత్త్వార్థముక్తాకలాపంవచనము. ౦-౨-౦
దశవింశతితత్త్వకందార్థములు. ౦-౧-౦
బ్రహ్మజ్ఞాన ఉపదేశవాక్యంబులు, పరమహంసవిద్య. ౦-౩-౦
సందేహనివారణ ప్రకాశిక. ౦-౨-౦
సంసారబంధవిముక్త్యుపాయబోధ. ౦-౨-౦
శ్రుతిమాలార్థానుభవబోధిని. ౦-౨-౦
వేదాంత శతక పదార్థమంజరి. ౦-౪-౦
శ్రీసన్న్యాసోపన్యాసము. ౦-౩-౦
జీవన్ముక్తిదాయిని, పుత్రోత్సాహ ప్రదాయిని. ౦-౩-౦
ముముక్షుజనకల్పకము. ౦-౬-౦
దృగ్దృశ్య వివేకము. తా. ౦-౧౦-౦
అమృతబిందోపనిషత్తు.శ్లో.తా. ౦-౨-౦
వేదాంతపంచదశిటీకాతాత్పర్యం౫-౦-౦
ఆత్మబోధము శ్లో. తా. ౦-౪-౦
మతత్రయ హితబోధిని. ౦-౨-౦
హఠయోగ ప్రదీపిక ౧౦౪ యోగాసనపటములుఁగలవు. ౨-౮-౦
బ్రహ్మసూత్రములు, టీకా తా॥ ౨-౮-౦
శ్రీజ్ఞానవాశిష్ఠము.వచనకావ్యం ౫-౦-౦
శ్రీరామశామామృత సత్స్వరూప సంకీర్తనలు శ్రీమద్వేదాంత పరిపూర్ణయచల నిర్గుణ వచనములు. ౦-౪-౦
సర్వేశ్వరశతకము. ౦-౧-౦
శ్రీనాగానందస్వామిగారి చిద్విలాస శతకము.— ఇందు వేదాంతకీర్తనలు కందార్థములు జ్ఞానాష్టకములు కృతులు గలవు. ౦-౪-౦

సంస్కృత గ్రంథములు.

శ్రీమద్రామాయణం, వ్యాఖ్యాన చతుష్టయము 2-వాల్యూములు. ౧౫-౦-౦
శ్రీమద్రామాయణం, మూలం. ౨-౮-౦
శ్రీరుద్రాధ్యాయము రుద్రము,నమకము చమకము, అనురెండు పన్నములును, స్వరయుక్తము రుద్రము భాష్యాంధ్ర వివరణమను పేర టీకతో ముద్రింపఁబడినది. ౧-౪-౦
లక్ష్మీస్తోత్రరత్నత్రయం శ్లో-తా.౦-౧౨-౦
వేదాంతరత్నాకరము,శ్లోక. తా.౦-౬-౦
అరుణవ్రతములు. ౦-3-౦
కర్మవిపాకము. తాత్పర్యము. ౧-౦-౦
దత్తకమీమాంసదత్తకచంద్రిక ౦-౧౨-౦
దక్షిణామూర్తిస్తోత్రము. ౦-౪-౦
పురాణోక్త కర్మప్రకాశిక ౧-౪-౦
పురాణోక్త అపరకర్మప్రకాశిక ౧-౪-౦
యాజుషశ్రౌత స్మార్తానుక్రమణిక ,నాలుగు భాగములుగలది. ౪-౦-౦
యాజుషాపరప్రయోగానుక్రమణిక సస్వరం ధర్మశాస్త్రసహితం.౨-౦-౦
నిర్ణయసింధువు ౨-౦-౦
యాజుషస్మార్తమంత్రపాఠము, సస్వరము, ప్రథమభాగము. ౨-౮-౦
యాజుషస్మార్తమంత్రపాఠము, సస్వరము, ద్వితీయభాగము ౨-౮-౦.
శూద్రకమలాకరస్మృతి పూర్వ ప్రయోగము. ౧-౪-౦
మల్లాజీయము, తా॥ ౨-౦-౦
డిటో మూలము. ౧-౦-౦
శ్రీమద్రామానుజ చరిత్రము. ౧-౦-౦
కాళిదాస కథామంజరి ద్వితీయభాగము ౦-౮-౦
రిట్టమతశాస్త్రము. తెనుగు తాత్పర్యసహితము. ౦-౧౨-౦

టీకా, అమరము ౮-౧౪-
డిటో గ్లేసుకాలికోబైండు౧-౧౨-
అప్పకవీయం శుద్ధప్రతి గ్లేజు కాగి ములు, కాలికోబైండు. ౧-౬-
డిటో రఫు అట్టబైండు. ౧-౦-
ఆంధ్రనిఘంటుత్రయము ౦-౧౨-
వ్రతరత్నావళి అను ౨౮ వ్రతకల్పము తెనుగు కథాసహితము. ౦-౮-
సమ్మోహనము & అదృష్టరాజ అనేకులు అభ్యసించి అనేకము అత్యద్భుత కార్యములు చేయగల నిచ్చు మనోవశ్య తత్వశాస్త్రము ౧-౮-
యిందుకు అభ్యాసనాచక్రము. ౦-౪-
సర్పశాస్త్రము తేలు పాములు మొదలగు వాటి మంత్రౌషధములు గలదు. ౦-౮-
వాల్మీకిరత్నములు. శ్లో. తా. ౧-౪-
ఆంధ్రమహాభారతరత్నములు ౦-౧౦-
దేవాంగపురాణము. శ్లో. తా. ౦-౧౪-
సప్తాశ్వనందము ౦-౪-
పరిపూర్ణ తత్వప్రకాశిక ౦-౫-
వైశాఖమాహాత్మ్యము ౨-౦-
ఆబ్దికప్రయోగము ౦-౮-

(ఆంధ్రభారతము పద్యకావ్యము)

ఆది - సభాపర్వములు. ౨-౪-
ఆరణ్యపర్వము. ౨-౪-
విరాట - ఉద్యోగపర్వములు. ౨-౪-
భీష్మ - ద్రోణపర్వములు. ౨-౪-
కర్ణ - శల్య - సౌప్తిక - స్త్రీపర్వములు శాంతిపర్వము. ౨-౪-
అనుశాసనిక- అశ్వమేధ- ఆశ్రమవాస- మౌసల- మహాప్రస్థానిక- స్వర్గారోహణ పర్వములు. ౨-౪-
పురూరవచక్రవర్తిజననాటకం. ౦-౨-

### హరికథగ్రంథములు.

| | |
|---|---|
| గౌరీశంకరోపాఖ్యానము. | ౦-౨-౦ |
| కాళీయమర్దనము, జంగంకథ. | ౦-౨-౦ |
| శ్రీకాళికాంబికాస్తోత్రసంకీర్తనం. | ౦-౪-౦ |
| కేదారేశ్వరనోముల వ్రతకథ. | ౦-౦-౬ |
| విశ్వకర్మప్రభావము. | ౦-౨-౦ |
| ధ్రువచరిత్రము. | ౦-౨-౦ |
| కబీరుదాసు చరిత్రము. | ౦-౪-౦ |
| రత్నమాలికాపరిణయంహరికథ. | ౦-౨-౦ |
| హరిశ్చంద్రోపాఖ్యానంహరికథ | ౦-౨-౦ |
| చిత్రాంగినాటకము. | ౦-౬-౦ |
| సుదర్శనదాసు-కుచేలోపాఖ్యాన | ౦-౮-౦ |
| సుదర్శనదాసు- కర్ణుని చరిత్రము | ౦-౮-౦ |
| సుదర్శనరామానుజదాసుకీర్తనలు | ౧-౦-౦ |
| చౌకామేళుని చరిత్రము. | ౦-౩-౦ |

### జ్యోతిష గ్రంథములు.

| | |
|---|---|
| దైవజ్ఞసంపూర్ణచంద్రిక | ౦-౬-౦ |
| తులసీప్రతిష్ఠా | ౦-౨-౦ |
| నవగ్రహప్రదర్శిని | ౦-౨-౦ |
| వాస్తుదర్పణము-వాస్తుదీపిక | ౦-౮-౦ |
| వాక్యప్రశ్నసారమ్ | ౦-౩-౦ |
| ముహూర్తచింతామణిజ్యోతిషగ్రంథము తాత్పర్యసహితము. | ౧-౪-౦ |
| కాలామృతము. | ౦-౧౨-౦ |
| ముహూర్తదర్పణము. | ౦-౮-౦ |
| బృహజ్జాతకము. | ౧-౮-౦ |
| కేరళప్రశ్న. | ౦-౧-౬ |
| గోచారదర్శిని ప్రథమభాగం. | ౧-౦-౦ |
| ,, ద్వితీయభాగము. | ౦-౧౨-౦ |
| జినేంద్రమాల. | ౦-౧౦-౬ |
| ముహూర్తచంద్రిక. | ౦-౮-౦ |
| జాతకచంద్రిక. | ౦-౨-౦ |
| ముహూర్తసంగ్రహం. | ౦-౨-౦ |
| వాస్తుఫలసంగ్రహం. | ౦-౧-౦ |
| ఆరోగ్యశాస్త్రము, | ౩-౦-౦ |
| కృష్ణవాస్తు. | ౧-౬-౦ |
| మయవాస్తు. | ౦-౩-౦ |
| సాముద్రికము, సటీక. | ౦-౨-౦ |
| జాతకాలంకారము. | ౦-౬-౦ |
| గృహవాస్తు. | ౦-౨-౦ |
| ఆర్తవచంద్రిక. | ౦-౫-౦ |
| జలార్గళశాస్త్ర సంగ్రహము. | ౦-౩-౦ |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము. | ౦-౫-౦ |
| షట్పంచాశికా ప్రశ్నశాస్త్రము.తా. | ౦-౬-౦ |
| జ్యోతిషఫలబాలబోధామృతము | ౦-౪-౦ |
| ముహూర్త ప్రదర్శిని. | ౧-౦-౦ |
| ప్రశ్నదర్శిని అను ఆరూఢ ప్రశ్నశాస్త్రము తాత్పర్యసహితం. | ౦-౬-౦ |

### వైద్యగ్రంథములు.

| | |
|---|---|
| చికిత్సారత్నము. | ౧-౪-౦ |
| ధన్వంతరినిఘంటువు. | ౨-౮-౦ |
| వాజీకరకల్పద్రుమము. | ౧-౮-౦ |
| వైద్యచింతామణి ౨ వాల్యూములు | ౮-౦-౦ |
| శార్ఙ్గధరసంహిత. | ౩-౦-౦ |
| బసవరాజీయము | ౭-౦-౦ |
| సర్వౌషధగుణకల్పము. | ౨-౮-౦ |
| చికిత్సాసారము. | ౨-౮-౦ |
| అనుపానమంజరి. | ౦-౮-౦ |
| అనుపానరత్నాకరము. | ౦-౧౨-౦ |
| సద్వైద్యజీవనము. | ౦-౮-౦ |
| వైద్యశతశ్లోకి. | ౦-౪-౦ |
| గురుశిష్యసంవాద - వైద్యచింతామణి. ఇందు నవనాథ సిద్ధక్రియలు, ద్రవ్యశుద్ధి, రసయోగకషాయంబులు, తైల, లేహ్య ఘృతచూర్ణంబులు, నస్యధూపిత క్షేమ జ్యక్రమంబులు, మొదలగు సారతమాంశంబులు విపులంబుగ విశదీకరింపఁబడి యున్నది. ఈయొక్క గ్రంథముచేత సకలవైద్యవిషయము తెలియంగ గలరు. | ౧-౧౨-౦ |

మల్లమ్మదేవిచరిత్రముజంగంకథ. ౦-౬-౦
అన్నదానఫలమహాత్మ్యము హరికథ. ౦-౩-౦
సిద్ధరామశతకము. ౦-౨-౦
కాళహస్తిమాహాత్మ్యం వచనం. ౦-౪-౦
పచ్చప్రుదాంగ. ౧-౪-౦
తారుమారుకథలగుంప అతి చమత్కార ముగ నొక్కొక్కకథయందు నొక్కొక్క రసముండును. ౦-౧౨-౦
బాణాసుర యుద్ధపదము ఉష కలలో కనపడిన అనిరుద్ధుని పెండ్లి చేసుకొనినకథ. ౦-౮-౦
వైకుంఠమాహాత్మ్యము పదము కుశలవుల కథ. ౦-౬-౦
మల కుమారుతినవల. ౦-౬-౦
మరకతవల్లినవల స్త్రీలకు హస్తాభరణము వంటిది. ౦-౪-౦
శమంతసేన చక్కనినవల. ౦-౬-౦
అనురాగవిపాకము నవల. ౧-౧౦-౦
రుద్రమదేవి నవల. ౦-౧౨-౦
సుశీలమైనావతి నవల. ౦-౧౨-౦
లావణ్యమయీ నవల. ౦-౬-౦

వచన గ్రంథములు.

శ్రీ మహాభారతము. తెనుగు వచనకావ్యము. ఇది మహాభారత విషయములలో యొక విషయమునైనను వదలిపెట్టక సంపూర్ణముగ తెనుగున వచనకావ్యముగ రచియింపబడినది.

ఆదిపర్వము. ౧-౪-౦
సభాపర్వము. ౦-౬-౦
అరణ్యపర్వము. ౧-౧౨-౦
విరాటపర్వము. ౦-౧౨-౦
ఉద్యోగపర్వము. ౧-౦-౦
భీష్మపర్వము. ౧-౦-౦
ద్రోణపర్వము. ౧-౦-౦
కర్ణపర్వము. ౦-౧౨-౦
శల్యపర్వము. ౦-౧౦-
సౌప్తికపర్వము. ౦-౬-
స్త్రీపర్వము. ౦-౪-
శాంతిపర్వము. ౧-౪-
అనుశాసనిక పర్వము. ౦-౧౨-
అశ్వమేధపర్వము. ౦-౧౦-
ఆశ్రమవాసపర్వము. ౦-౫-
మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు. ౦-౫-
డిటో దళసరికాగితములు 3 వాల్యము సెట్టు ౧-కి. ౨౧-౦-

శ్రీ వాల్మీకిరామాయణము. ఆంధ్రతాత్పర్య విశేషార్థములు, ఎడమపై పుటలలో శ్లోకములు, కుడివైపు పుటలలో తాత్పర్య విశేషార్థములుగ ముద్రింపబడినది కనుక, పారాయణమునకు, లేదా, కథనుమాత్రము చదువుటకు మిగుల అనుకూలముగ నుండును.

బాలకాండము. ౧-౧౨-
అయోధ్యకాండము. ౨-౧౨-
ఆరణ్యకాండము. ౧-౧౨-
కిష్కింధకాండము. ౧-౧౨-
సుందరకాండము. ౨-౦-
యుద్ధకాండము (అచ్చులోనున్నది.)

సంగీతగ్రంథములు.

స్వరమంజరి. ౦-౫-
గాయకపారిజాతము. ౧-౪-
సంగీతకళానిధి. ౧-౪-
గాంధర్వకల్పవల్లి. ౨-౮-
గాయక సిద్ధాంజనము 1-వభాగ. ౨-౦-
" 2-వ భాగము. 3-౦-
గానేందుశేఖరము. 3-౮-
భగవత్సారామృతము. ౦-౪-
పల్లవి స్వరకల్పవల్లి. ౨-౦-



ఓమ్.

శ్రీ నారాయణాయనమః.



సర్వ వేదాంత పరమరహస్యంబగు

# కైవల్యామృత మోక్ష గ్రంథము.



## శ్రీ గు రు మ హి మా భి వ ర్ణ న ము.

తే॥ గురువు కన్నను బ్రహ్మంబు ధరణిలేదు ।
అరయ సత్యంబు సత్యమో యబ్జవదన ।
మూఁడు లోకములందు నద్భుతముగాను ।
నాద్య మెఱిఁగింతు నీకొఱ కవధరింపు ॥

తా. ఓ పార్వతీ ! మూఁడులోకములయందును గురువుకంటె బ్రహ్మమను వస్తువు వేఱేలేదు. ఇదియే సత్యము. సత్యము. కావున నీకు ఆద్యంబైన(శ్రుతిసమ్మతమైన) దానిని తెలియఁజేసెదను వినుము.

తే॥ గోప్యమై విద్య జగముల జనములకును ।
గానరాకుండు నా యాత్మఁ గనుట కేమి ।
కారణంబన్న గురువచః క్రమము చేతఁ ।
దెలియవచ్చును బరమాత్మ దివ్యసరణి ॥

తా. ఓ పార్వతీ ! పరబ్రహ్మవిద్య మహారహస్యమై లోక మందలి జనులకుఁ దెలియరాకుండును. అట్టి పరమాత్మ విద్యను దెలిసికొనుటకు కారణం బేదియనఁగా, గురుబోధము చేతనే ఆ రహస్యము తెలియనగును.

హరిః ఓం॥ శ్రీమత్సదానంద మచింత్యమవ్యయం।
శ్రీమత్సదానంద మరూపమద్వయం।
శ్రీమత్సదానంద మఖండమచ్యుతం।
శ్రీమత్సదానంద గురుం నమామ్యహం॥

శ్రీమదఖిలవేదాగమ పురాణ శాస్త్రార్థసారమును గ్రహించి, ముముక్షు జనోపకారార్థముగా, సర్వజనులకు స్పష్టముగా దెలియునట్లాంధ్రభాషయందు ప్రబంధరూపముగా, కైవల్యామృత మోక్షమను గ్రంథము, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్బ్రహ్మవిద్యాసిష్ఠ సిద్ధాంత నిర్ధారణులయిన అన్నావధూతస్వామి శిష్యుఁడగు వేంకటచిదానందయోగిచే రచియింపఁబడి. మోక్షైకప్రధానమగు వైరాగ్యప్రకరణము ముందుగా నారంభింపఁబడియె.

## వై రా గ్య ప్ర క ర ణ ము.

సత్యజ్ఞానానందాద్వయ బ్రహ్మనిష్ఠయుండుండు గురురాయని పాదపద్మములసన్నిధికి, పూర్వజన్మసుకృతపరిపాకంబున, నొక్క సజ్జనుండు, సకలమైన వేదశాస్త్రములంజదివి, దేనిచేతందృప్తిఁగానక, దైవవశంబున స్వేచ్ఛగానే తెంచిచూచి, యీమహానుభావునివలన, నీసంసారసాగరమునుతరించెదనని యతనికి నిష్కాపట్యభక్తి యుక్తుండై, సాష్టాంగనమస్కారము జేసి, లేచినిలచి, నిటలతట ఘటితాంజలిపుటుండైయున్న శిష్యుని, కరుణాసముద్రుండగు, గురుండుమెల్లన చల్లని చూపులంజూచి, కూర్చుండనియోగించి, యోవత్సా? నీభక్తివిశ్వాసంబులకు మాకుసంతోషంబయ్యె; నీవు మాసన్నిధికి యేమి యపేక్షించివచ్చితివో, వేడుమిచ్చెదమనిన, శిష్యుండిట్లనియె ఓపరమగురో, ఈ సంసారసాగరమందు, బహుకాలమునుండి మునుగుచుం దేలుచు దరిగానక శ్రమబొంది నేటికి, భవసాగరతరణోపాయమగు తమపాదారవిందముల నాశ్రయించినవాఁడను; నా మొఱవిని రక్షించెడుకర్త దేవరవారేయని, త్రికరణశుద్ధిగా, చతుర్విధ శుశ్రూషలంజేయు శిష్యునింజూచి, అవిద్యావరణ రహితమానసట్లు నాశీర్వదించి॥ శ్రు॥ "తరతిశోకమాత్మవిత్॥" అని శ్రుతివాక్యముగనుక నాత్మజ్ఞానముచే దుఃఖమనుసాగరము, తరింతురని ప్రమాణము; ఇందుకుజ్ఞానోపదేశమే చేయు

వలయు॥ శ్రు॥ "జ్ఞానమేవమోక్షః॥ అనియు॥ జ్ఞానంవినామోక్షోనసిద్ధ్యతి॥" అనియు శ్రుతులుపలుకును; ఇందుకుసాధనము, భక్తివైరాగ్యములుగనుక, నిందులో వైరాగ్యము తెలియునా? యనినశిష్యుండిట్లనియె. స్వామీ? జ్ఞానమెఱుంగ, భక్తియు నెఱుఁగ, వైరాగ్యము నెరుగ, దేవరవారే తెలిపి కడతేర్పవలయుననిన, శ్రీగురుండిట్లనియె. నీవు మా వాక్యములయందు మనస్సునుంచి ఇతరసంకల్పములువిడిచి, మేము చెప్పినయర్థము విని సంశయముగలచోట నడిఁగి తెలుసుకొనుచు నేకాగ్రచిత్తముగలవాఁడవై వినుము, వైరాగ్యమనఁగా; ఈషణత్రయవర్జితుండై. దేహాభిమానము విడుచుటయే. ఈషణత్రయమనఁగా, ధనేషణ, దారేషణ, పుత్రేషణలనంబడు. ఇందు పుత్రేషణమెట్టిదనిన; పుత్రులు పుట్టకముందుపుట్టరాయెనని దుఃఖము, పుట్టియుంగరహితమైనను దుఃఖము, వ్యాధిగలిఁగెనేని దుఃఖము, ధూర్తుఁడాయెనేని దుఃఖము, విద్యరాకపోయినదుఃఖము, పెండ్లిగాకపోయిన దుఃఖము, తన్ను యెదిరించిన దుఃఖము, మరణమాయెనేని దుఃఖమునకు పారములేదు. ఇఁక ధనేషణమెట్టిదనిన; ధనము లేనికాలమందు లేకపోయెనను దుఃఖము, ధనార్జన కాలమందును దుఃఖము, వ్రయ కాలమందు మిక్కిలి దుఃఖము, రాజ చోర దారాపుత్రాదు లెక్కడ నపహరింతురోయని సర్వదాదుఃఖము. ఇఁక దారేషణమెట్టిదనిన; కామాతురుఁడై రక్త, మాంస, మల, మూత్ర, దుర్గంధముల చేనింపబడ్డ, అవయవములుగల స్త్రీభోగములంజిక్కుబడి దుఃఖము నేయనుభవించుచు, సుఖమనితలంచి వీరిని పోషించుటకై, శునక, శూకరాదులవలెశిగ్గువిడిచి కృషి, వాణిజ్య, సేవకాదిప్రయాసలకు నోడంబడు మూఢులయవివేకము దారేషణయనంబడు. ఇవియే యీషణత్రయంబులనంబడు. ఇఁక దేహాభిమానమెట్లనిన; ఈదేహమెత్తినది మొదలంత్యమువఱకుదుఃఖమే యనుభవించును, ఏలాగనిన; ఈదేహము తల్లి గర్భవాసమందుండుకాలంబున మల, మూత్ర, క్రిమి, కీటకాదులవలనను; జఠరాగ్ని చేతపించుచు తల్లి భోజము సేయఁగా, గర్భములోసందులేక నిండియుండుటచేత శ్వాసము విడుచుటకు శక్తిలేకను జన్మకాలమందు ప్రసూతివాయువుచే పర్వతాగ్రమునుంచి తలక్రిందైబడు క్రిమివలె భూమియందుబడి దుఃఖించుటచే

తనున్ను; మల,మూత్రములలో పొరులాడుచు గర్భవేదనగలిఁగినను, చీమ, దోమ,వృశ్చికాదులచే కాటుబడినను చెప్పుటకునోరురాక, దుఃఖించుటచేతను, యౌవనంబున కామాతురుఁడై కామాగ్నిచే కాలుచుఁ భార్యలేకపోయెననియు, బిడ్డలు లేకపోయిరనియు, ధనములేకపోయెననుదుఃఖముచేతను, జరామరణములుగలిగి, జడమై, అనిత్యమై, దుఃఖస్వరూపమై, మలమూత్రమాంసశల్య రక్త క్రిమి నరములపై చర్మముఁబొదిగిన జంత్రపుబొమ్మకైవడి కరచరణాద్యవయవాకారమై యరిషడ్వర్గములకు నాలయమై, ఆదిమధ్యాంతములయందు సర్వదాదుఃఖముగలదీశరీరమని యెఱుంగక పామరముచేయుచుండెడు మూఢుల యవివేకమే దేహాభిమానము; ఇదేసంసారబంధము;ఇందుకుదృష్టాంతము నిరాలంబోపనిషత్తు॥ "దుఃఖమితీచః, అనిత్య సంసార విషయబద్ధోదుఃఖః॥" అని చెప్పియున్నదిగనుగ, వివేకులయినవారు విచారించి యీదేహము నీభోగములు హేయములనియు, దుఃఖకరములనియు, నెఱిఁగి జన్మరహితమైన మోక్షమెవరివలన గలుఁగును ఏపుణ్యాత్ములవలన తెలియవచ్చునని యార్తిబొందుటయే వైరాగ్యముగాన దేహాభిమానమేబంధము; ఇందుకుదృష్టాంతము నిరాలంబోపనిషత్తు."కర్తృత్వాద్యహంకారసంకల్పోబంధః" అనగా నేనుకర్తను, ఇదినాయది, యనునహంకారమే బంధము; నాభార్య, నాబిడ్డలు,నాధనము,నాదేహము, అనుటయే జీవత్వము; ఇట్టియభిమానము విడిచెనేని జీవన్ముక్తినిబొందును; ముఖ్యముగా దేహాభిమానము విడువవలయును; లేనియెడ సంసారమను నరకమందు మునుగును. నిరాలంబోపనిషత్తు॥ "అసత్యసంసారవిషయ జనకసంసర్గయేవనరకః" అని చెప్పియున్నదిగాన నీయీషణత్రయములను విచారించి వీనియందభిమానమునువిడువవలెను. అది యెటువలెనన్నను. భార్య యొకతల్లిదండ్రులకు పుట్టియు, తానొకతలిదండ్రులకుపుట్టియు, జన్మమందు నాయిద్దరు నొకనాడు రాకపోవుట తెలిసియు, నడుమ కర్మబంధముచే, అడివి యుసిరికాయ సముద్రపు లవణము కలసినట్లు కలసినను అంత్యమందు వొకరినివిడిచి యొకరు బోవుచున్నారుగాని, యొకరితో నొకరు వెళ్లుటయును లేదు; ఒకరినినొకరు చావకుండునట్లుచేయుశక్తియును లేదుగాన

"నాభార్య" యనఁగూడదు. ఇకపుత్రులన్న, నాపుత్రులనునీవు సృష్టించలేదు, నీభార్య సృష్టించలేదు, యితరులును సృష్టించలేదు; యిది యునుఁగాక; పుత్రుఁడుమృతుఁడాయెనేని నీవుతోడుబోవుటలేదు, నీవు మృతిబొందితివేని నీపుత్రుఁడును నీతోడవచ్చుటలేదు, మృతిపుత్రుని నిలుపుకొనుశక్తియునునీకు లేదుగాన,నాపుత్రులనుట భ్రాంతియే. అది యెట్లనిన; స్వప్నమందు గొడ్రాలు బిడ్డలగన్నట్లు భగవత్సృష్టివలనఁ నీకొక పుత్రుఁడుగాతోచెను, ఈపుత్రుని యేలాగున "నాపుత్రుఁడు" అనవచ్చును ; భగవత్సృష్టివలన గలిఁగిన పుత్రదారాదులను భగవత్పుత్రులనవలెగాని తనపుత్రులనరాదు. ధనము నాయదియనిన, నీవుజన్మించుతఱి తోడ తెచ్చినదిగాదు, అంత్యకాలమందున నీతోడఁ గొనిపోవుటయు లేదుగనుక, నాదెనఁగూడదు. ఈషణత్రయములు నాదిగావన్న నీదేహమైనను నాదికాదాయనిన; కాదు? ఎటులనంటే, ఒకరివద్ద నెరువుతీసుకున్న యిల్లువంటిదని యెఱుంగునది, సృష్టిమొదలుగా తాజేసుకొన్న కర్మముచే ననేకమయిన జన్మములెత్తి యంత్యమునకు కామ్యార్థమైనసత్కర్మచే నీశ్వరుని వేడుకొనినందున నీమనుష్య శరీరము దయచేసిరనిన, స్వామీ ? ఈజన్మాదులెత్తు జీవుఁడు వీడేకదా, పూర్వదేహ ధర్మాదుల నెందుకెఱుఁగకబోయెననిన గురుండిట్లనియె. ఈజన్మమున జాగ్రతావస్థయందుఁ మృతిబొందిన తలిదండ్రులు స్వప్నావస్థలోఁ బ్రతికి యున్నట్లు తోఁచి వారితోమాట్లాడి సంతోషించినపుడిది యొకరును నబద్ధమని తెలియకపోయిరి, వీరుమృతిబొందినవారలని జాగ్రతలో నెఱిఁగినజీవుడే తానిప్పుడు స్వప్నము కనగదా ఎందువలన పూర్వపు వివేకము లేకపోయెను, కావున దేహమువిడిచి యన్యదేహము కలుగుటచే పూర్వజ్ఞానమునకు మఱుపుగలుఁగుననుటకు సందేహములేదు, అందువలన పూర్వజ్ఞానములేక మఱచి పంచభూతాత్మక మయిన యీశరీరము నాదియని మఱచి నిశ్చయించుటచేత నొకరికిని పూర్వజ్ఞానము లేకపోయెను. ఈదేహము యెరువనుటకు దృష్టాంతము; తానునివసించుటకు నిల్లును వాడుకొనుటకు పాత్రలును నొకరినడిగితీసుకొని యాయింట ప్రవేశించి కొంతకాల మాయింట సుఖించియుండఁగా నాయిల్లు గలవాఁడు నాపాత్రి

లు నాయిల్లు విడిచివెళ్లుమన్నప్పు డత్యాశచే మఱపుగల్గి యిదినాయి
ల్లు, నాపాత్రలు, నేనువిడిచివెళ్లుట లేదన్న, నిల్లుగలవాఁడు స్వతం
త్రుఁడవుటచే తనయిల్లు తనపాత్రములను బలాత్కారముగా తీసుకొ
ని పరులసొమ్మునకాశించి యబద్ధమాడి నందుకు ప్రభువుచేశిక్షితుం
జేయించిన వెనుక, తానుండుటకిల్లు మరలనడిగిన నిల్లుగలవాఁడు వీని
నమ్మక నిల్లు, పాత్రముల నివ్వనట్లీశ్వరుఁడు తనను వేడుకొనఁగా కరు
ణించియిచ్చిన మనుష్యజన్మమును సర్వసంపదల నెవఁడు నాది, నాశ
రీరము, నాబిడ్డలు, నాభార్య, నాధనము, నాయిల్లని యాశచే విడువ
నోపఁడో యట్టి పామరుని, భగవంతుఁడు స్వతంత్రుఁడగుటచేఁ తన
పదార్థములను త్యాగహించి పామగముచే నాశించినందుకు నరకమం
దుశిక్షించి పునర్జన్మమందు వానికిమేలయిన మనుష్యజన్మమునుసుఖిం
చుటకు తగినభోగభాగ్యములు నివ్వక, క్రిమికీటకాది శునకశూకరాది
జన్మములనిచ్చి, శ్రమబొందించుననిన, శిష్యుండిట్లనియె, స్వామీ? మృ
తిబొందినవారుఁ జన్మములెత్తుదురాయనిన; శిష్యా? జాగ్రతావస్థలో జీ
వుఁ డనుభవించినది, చూచినది, విన్నది, తలంచినది, సంకల్పించుకొ
నువస్తువులు, స్వప్నావస్థలోనవియె, సత్యముగా ననుభవించి నట్లుండు
నుగనుక యీజన్మములోనాసించిన విషయవాసనలే మరణముపొందు
నపుడు తలంచుచున్నందున. పునర్జన్మమున కంకురమైదానికితగిన శ
రీరమునెత్తి యనుభవించుగాన, నజ్ఞానముచే మృతిబొందినవారు పుట్టు
టసత్యము; ఎపుడు బ్రహ్మజ్ఞానము గల్గునపుడు జన్మరహితమౌను; కా
వునసీజగంబు, యెండమావులవంటిదని యెరిఁగి దీనియందు నిరాశగల
వాఁడై యుండవలయును, శ్లో॥ "పంచభూతాత్మికంవిశ్వం మరీచీజలస
న్నిభం॥" అని చెప్పియున్నది॥ ఇందుకుదృష్టాంతము; యండచే తప్త
మైదాహముగొన్నవానికి యండమావులనుచూపి, యిదిగోజలమీజల
ముచే స్నానముచేసి, మడిగట్టుకొని వంటచేసి భుజించి, తృప్తిగా
దాహముపుచ్చుకొని, సుఖపడుటకై పరుగు లిడుమని బోధించినవాని
మాటలునమ్మి, పరుగులిడి శ్రమబొంది, యెంతదవ్వరిగియు నాజలము
చిక్కక నందుచేతృప్తిగానక తుదకు నిరాశుఁడైనటుల సంసార తా
పత్రయములచే దహింపఁబడి, ఈదారాపుత్రాది ధనసంపదలు సత్య

ములనిబోధించేవారిమాటలు నమ్మి యాశఁజెంది వీనికై దివారాత్రములు శ్రమబొంది, ఏవిధమున దృప్తిగానక నత్యంతమున మృత్యువుచే జిక్కితుదకొకటియు లభింపక నొంటరియైయమభటులచే బాధలబొందెను. అనిన, స్వామీ? ఈరీతిపామరముచే తెలియకుండుటకు కర్తవ్యంబేమనిన; వత్సా, భగవంతుడుజేయు నుపకారమ్ముల మఱచుటచేనీయజ్ఞానంబుగలిగెననిన, స్వామీ, ఆయుపకారంబు లెవ్వియన; వత్సా, తననుతల్లిగర్భమందు నవమాసములు పోషించు వాఁడును, ఉత్పత్తితోడనే వీని సంరక్షణార్థమై తల్లి స్తనములందు స్తన్యముగల్పించువాఁడును జగద్విచిత్రములుచూచుటకు నేత్రములును, వినుటకు శ్రోత్రములును, రుచులగ్రహింప జిహ్వయు, గంధాదుల నాఘ్రాణింప ఘ్రాణమును, నడవపాదములును, ధర్మకర్మములఁజేయుటకు హస్తములును, సర్వమునుగ్రహింప బుద్ధియు, నిటుల సర్వేంద్రియముల నిచ్చినవాఁడును, దారాపుత్ర, ధన, ధాన్య, గో, భూ, హిరణ్యాదులను, పానసస్యాదులకై వర్షములు, సర్వసంపదలనిచ్చి యానందపరచు నీశ్వరుని మఱచి సర్వకాలముల రాజులను దారా పుత్రాదుల సేవలు చేసుకొనుచు నోటికుండలోపోసిన నీరు క్షీణించునట్లు దినదినము నుదయాస్తమయములందు నాయువు క్షీణమగుచుండు నెఱుంగక మధుమక్షికములుబహుప్రయాసపడికూర్చిన మధువు నితరులనుభవించినటుల తానును నతిప్రయత్నముచే గూర్చిన. ధనధాన్యములు రాజ, చోర, పుత్ర, భ్రాతృలపాలైజిహ్వాచాపల్యముచే గాలముమింగిన మత్స్యమువలెజిక్కి-బడిగుహ్యాచాపల్యముచే వలంజిక్కిబడిన సతియను కపోతంబునుంజూచిపతియగు కపోతంబు విడువలేకతనమరణమును దెలియక చింతింపుచులుబ్ధకునికోలంగూలిన కపోతంబుచందంబున మృతిబొందునుగనుక భగవదుపకారంబులం దలంచి వివేకులైన వారీలోకమర్మము నెఱింగివీటియందుజిక్కఁబడక విరక్తిజెంది విరాగులై సద్గురువుల నాశ్రయించిచతుర్విధశుశ్రూషలఁజేయుచు నిష్కాపట్యభక్తియుక్తుండైన శిష్యునియందుకరుణచే జ్ఞానభక్తి వైరాగ్యములం దెలిపి మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుం జేతురు. శ్లో॥ "ఇదం తేనాతపస్కాయ । నాభక్తాయకదాచన । నచాశుశ్రూషవేవాచ్యం నచమాం యోభ్యసూయతి" అని భగవద్వాక్య మున్నదిగనుక

నీరహస్యము భక్తిశుశ్రూషలు గల యతినికిగాక నితరులకు లభింపదు, అనిన, గురునకుశిష్యుండు భక్తిశుశ్రూషలు జేయుచుసాష్టాంగ నమస్కారములజేసి, ఓపరమగురవా? నీపూర్ణ కరుణచే నీజగదాద్యారోపణమాయాకార్యములఁ దెలిసియనిత్యములనియు, హేయములనియు నీదారాపుత్రాది ధనధాన్యములయందు వాంత్యశనమువలె విరక్తిఁ జెందెను. ఇఁకభక్తిమార్గం బెట్టిదో తెలిపికరుణింపుమనిన; శిష్యునివైరాగ్యమునకు సంతసించి భక్తియోగము జెప్ప నారంభించెను.

వైరాగ్య ప్రకరణము సమాప్తము॥



## భక్తియోగ ప్రకరణము.

శ్లో॥ "వేతు ధర్మ్యామృత మిదం యదోక్తంపర్యుపాసతే। శ్రద్ధధానామత్పరమాభక్తా స్తేతీవమేప్రియాః" అనఁగా నెవ్వరైన నేనే పరమగతి గాగలవారలై యీమోక్ష ప్రదమయిన యమృతమునుశ్రద్ధ గలవారలై నాచేఁజెప్పఁబడిన క్రమము నతిక్రమింపక సేవింపుచుందురో ఆభక్తులునాకు మిక్కిలి యిష్టులని భగవద్వాక్యము గనుక ఈశ్వర ప్రీతికై భక్తిచేయు టెట్లనిన॥ శ్లో॥ "మంత్రోలయోహటో రాజయోగశ్చేతి చతుర్విధః" అనఁగా మంత్ర,లయ, హట, రాజయోగములని నాలుగువిధములలో మంత్రయోగంబున్నే భక్తియోగం బందురు. ఇట్టి భక్తియోగలక్షణం బెట్లనిన. శ్లో॥ "ఏకాక్షరంద్వ్యక్షరంవా షడక్షరమథాపివా। అష్టాక్షరంవా మంత్రాయమంత్రయోగీ సదాజపేత్॥" అనఁగా, ఏకాక్షర, ద్వ్యక్షర, షడక్షర, అష్టాక్షరమంత్రములను నీనాలుగువిధములలో ఏకాక్షరమనగా ప్రణవము॥ శ్రు॥ "ఓమిత్యేకాక్షరంబ్రహ్మ, ఓమిత్రిబ్రహ్మ" అని యీప్రణవమే,బ్రహ్మమని శ్రుతులు జెప్పును. ద్వ్యక్షరమనఁగా అజపమంత్రము, అజపయనఁగా, జపము జేయక నేనిత్యమిరువదియొకవేలనార్నూరులజపమగుచునుండునది గాన నజపయనంబడె. ఈయజపమంత్రమధ్యమంబై ప్రణవమేపలుకును. ఎట్లనిన; సకారో పరిస్వరంబును హకారోపరిబిందువుంగూడి ప్రణవమే పలుకును. శ్లో॥ 'స' కారోధ్యాయతే జంతుర్హకారోహి బవేద్ధ్రువం" సకారరూపుఁడైన జీవుడు హకారరూపుడైన పరమేశ్వరుని కలపి ధ్యా

నించినట్టాయ సాహంకారమేయవును. అనఁగా బ్రహ్మైక్యమవును. షడక్షరి యనఁగా ప్రణవముతో గూడిన శివపంచాక్షరి యనంబడును. అష్టాక్షరి యనఁగా శ్రీహరియనంత నామంబులలో సారంబైనది సహస్రనామంబు; అందు ముఖ్యంబైన నారాయణ గాయత్రియందు ప్రథమోపాత్తమై ప్రణవయుక్తంబైన నారాయణ మంత్రంబష్టాక్షరి యనంబడు, పరబ్రహ్మమునకు స్వరూప లక్షణయనియు, తటస్థలక్షణయనియు,నిరు తెరఁగులుగలవు. అందుస్వరూపలక్షణయనఁగా; సత్తు,చిత్తు, ఆనందము, వీనివిడువనిది, నామరూపము విడిచితటస్థలక్షణ యనంబడు. ఇవిదృష్టాంతరూపముగా దెలిపెదము స్వరూపలక్షణ యనఁగా, ఉష్ణత్వ, ప్రకాశత్వ, రోహితాదులన అగ్ని యెటుల విడిచియుండదో, అటుల సత్తు, చిత్తు, ఆనందమును విడిచి బ్రహ్మముండదను నదియె. ఇదిజ్ఞానోపదేశమందుండు బ్రహ్మనిష్ఠ. ఇంక తటస్థలక్షణయనఁగా; మఱ్ఱిచెట్టుమీది చంద్రుడు, రావిచెట్టుమీది చంద్రుఁడని రెండు నామములున్నను చెట్లనువిడచునెడ చంద్రుఁడొక్కఁడే యున్నరీతి నొక్క-సచ్చిదానంద బ్రహ్మమే సృష్టి, స్థితిలయములకై రజ స్సత్వ, తమోగుణములతోఁగూడి హరిహరబ్రహ్మరూపములధరించెగానపరబ్రహ్మవతారమేహరిహరబ్రహ్మలని తెలిసి యుపాసించుట భక్తియోగము. ఇదియతటస్థలక్షణ, జ్ఞానముగల్గి బ్రహ్మసాక్షాత్కారమైన పిమ్మట నీనామరూపాదులను విడిచే లక్షణాభక్తులైనవారిట్టి భగవద్రూపములం దొక్కరని యుపాసించుట భక్తియోగము. అనిన,శిష్యుండిట్లనియె. స్వామీ? ఇట్టిశ్రీహరి యందు భక్తియెటువలె చేయవలయునో తెలియ నానతిమ్మనిన. గురుండిట్లనియె. శ్లో॥"శ్రవణం కీర్తనంవిష్ణోస్మరణం పాదసేవనం। అర్చనం వందనందాస్యం, సఖ్యమాత్మ నివేదనం" శ్రవణంబన, శ్రీహరిపెక్కులగు నవతారంబుల లీలా వినోదంబులాచరించిన కథలువినుట; కీర్తనంబనఁగా నట్టి శ్రీహరి దివ్యనామావళులు ప్రియంబునం బాడుట; స్మరణంబనగా శ్రీహరినామంబులలో సారంబై, ఆపోజ్యోతి రసామృతంబై, పరమ రహస్యంబై, బ్రహ్మేంద్రాది భక్తజనసేవితంబయిన, నారాయణయనుమంత్రంబు మనసున స్మరించుట, పాదసేవనంబనగా? శ్రీహరిదివ్యపాదా

విందంబుల హృదయంబున సేవించుట, అర్చనంబనఁగా, శ్రీహరినిహృదయపీఠంబున మానసపూజసేయుట, వందనంబనఁగా శ్రీహరిపాదారవింద బులకుసాష్టాంగ నమస్కారములుజేయుట, ధ్యానంబనగా శ్రీహరిని యనుశ్రుతంబుగా నవయనముల ధ్యానముజేయుట; సఖ్యమనగా నితరసంగములవిడిచి, శ్రీహరిపాదారవిందంబులే గతియని నమ్మియుండుట, ఆత్మనివేదన మనఁగా నేకాగ్రమైనచిత్తంబు శ్రీహరికర్పించి, సర్వమునుమఱచియుండుట. నవవిధభక్తులే ప్రథమసాధనము. ద్వితీయ్యంబైన యనన్యభక్తిమెట్లనిన॥ శ్రు॥ "విశ్వంనారాయణం దేవం" అనియు॥ శ్రు॥"సర్వభూతాత్మకో నారాయణః"అనియు॥ శ్రు॥ "ఏకో నారాయణః, నద్వితీయోస్తి" అనుశ్రుతులవలన సర్వమున్ను నారాయణుఁడు, సర్వమునారాయణనిర్మితము, సర్వభూతములయందుండి సర్వమును ప్రకాశింపఁజేయుచు సర్వసాక్షియైన వాఁడొక నారాయణుండు, అతనికన్ననన్యంబులేదని చూచుటయనన్యభక్తి. తృతీయ్యంబైన యేకాంతభక్తియెట్లనిన, ఇట్టియనన్యభక్తిగలిగి దృఢచిత్తంబున తనమనోపీఠమం దాత్మస్వరూపముగా సర్వము నెఱిఁగి సచ్చిదానందుఁడైన శ్రీమన్నారాయణు నేకాంతచిత్తమున నిశ్చలమైనబుద్ధియను జ్ఞాననేత్రముచే గాంచి, నిత్యానందంబునం జెందుట. ఇట్టిభక్తియోగంబువలన సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యంబులుం గలుగుననిన విని. శిష్యుండిట్లనియె. స్వామీ?భక్తిసాధనంబున నేపదంబునొందుదురో తెలిపి రక్షింపుమనిన; భగవదర్పితంబైన యనన్యభక్తిచే సామీప్య, సారూప్యంబులను, భగవదర్పితంబైన కాంతభక్తిచే సాయుజ్యంబునొందుదురనిన విని, శిష్యుడుపులకాంకిత శరీరుఁడై యానంద బాష్పంబులురాల శ్రీగురుండే భవతారకుండైన శ్రీమన్నారాయణుండని ప్రదక్షిణనమస్కారములజేసి శ్రీగురురాయా? నేధన్యుండనైతి ; నాభవబంధంబులువీడెనని ప్రణుతింజేసి, స్వామీ? మీకరుణచే భక్తి యోగంబుదెలిసె. నిఁక లయ, హఠయోగంబులం దెలియనిచ్ఛయించు చున్నవాఁడననిన, శిష్యుని భక్తివైరాగ్యంబులకుసంతసించి లయయోగంబుజెప్పనారంభించెను. లయయోగంబనేక భేదంబులై యుండుఁగావున నదియెంతయని దెలుపబోయెదను: అయినను

సూక్ష్మముగాఁ దెలిపెదను. సిద్ధాసనంబునం గూర్చుండి, నాసికాగ్రమందు దృష్టినిలిపి, తర్జని రెండు వ్రేళ్లచే రెండుచెవులు మూసినేని మహాధ్వని వినఁబడును; ఇఁకను వినగా గజ్జలధ్వని, పిమ్మట ఘంటానాదము, శంఖనాదము; వీణానాదము. తాళనాదము. పిల్లనగ్రోవి, భేరి, మేఘధ్వనులును. ఇంకను సాధింపఁగా భ్రమరనాదము వినుపించును; ఇదియ ప్రణవనాదము. ఈనాదమందు మనస్సులయము చేయుటయేలయ యోగము, శ్లో॥ "అనాహతశ్చ శబ్దశ్చ తచ్ఛబ్దశ్చ యోధ్వనిః। ధ్వరంతర్గతంజ్యోతి ర్జ్యోతిరంతర్గతంమనః। తన్మనోవిలయంయాతి తద్విష్ణోః పరమంపదం" అనిచెప్పియున్నది ఇఁకహఠయోగం బెట్లనిన,ఎడమకాలి మడిమె నాసనముక్రిందుంచి, కుడికాలిమడిమె బొడ్డుదగ్గర గదియించి ;-రొమ్ముమీఁదికి నిక్కి, గెడ్డమువంచి, షణ్ముఖముద్రచే నేత్రశ్రోత్ర నాసికములమూసి, వాయువులనూరివేసి హకారంబును పూరించి ద్వ్యక్షరియైన యజప మంత్రముచే కుంభకమునిలచి, సకారమును రేచకముజేసి, మూలబంధోడ్యాణబంధంబులచే షట్కమలముల భేదించి, వాయువును సుషుమ్నా నాడిలోనుంచి, సహస్రారంబునందెచ్చియుంచి, వాయువును వశముజేసికొని, అక్కడయున్న జ్యోతిస్స్వరూపమందునిలిచే దెద్దిగలదో అదే హఠయోగము; ఇదియష్టాంగ యోగములచే నిరువదియేడు సంవత్సరములు సాధించెనేని అష్టసిద్ధులుగలుగును. ఇఁకరాజయోగ మెట్లనిన; యోగములకెల్ల రాజుగానుండుటచే రాజయోగ మనఁబడియె. శ్లో॥ "త్రిషులక్ష్యేషు యోబ్రహ్మ సాక్షాత్కారం గమిష్యతి। జ్ఞానేనాద మనూవృత్యా లయతో రాజయోగవత్" ఇందులో "జ్ఞానేన" అనుటచే జ్ఞానంబని తెలియునది అదిముందు తెలుపుచున్నాను. ఇప్పుడిందు శాంభవీముద్ర రాజయోగమనంబడు, ఈముద్రకు మూడు లక్ష్యములున్నవి అవెవ్వియనిన.[కనురెప్పలురెండు కలియమూసి, నాసికాగ్రమందు చూపునిలిపి. జ్యోతిర్మయ దీపాంకురంగాభావించి, తత్తేజంబును చూచుచుండుటయే యమావాస్యదృష్టి?] యిదియంతర్లక్ష్యము కనురెప్పలు రెండు మూఁడుపాళ్లుమూసి, వెలపలి రెప్పపాటు లేకుండునటుల మధ్యనాసికాగ్రమునను దృష్టియుంచి, చెవరకుండునటుల, రక్త శ్వేత, కృష్ణ.

నీల, పీతాది పంచవర్ణంబుల మధ్యలక్ష్యం బెట్లనిన. పద్మాసనస్థుడై. ముఖముకొంతమెత్తి, నల్ల గ్రుడ్డుపై రెప్పలకిందికి పోలాగు జేసి, యడుగు రెప్పలమీది తెల్లగ్రుడ్డు వెలశల కనుపించులాగు నుంచి, చలనము లేక స్థిరబుద్ధి గలవాఁడై, ఒక యామము సాధింపగా దశవిధ మండలములుం తోఁచి యవి పోయి జ్యోతిర్మయాకాసంబునుం బొడఁగని, తత్తేజోమయంబునం సర్వంబునుమరచి, నిరామయం బైన బ్రహ్మనిష్ఠయే రాజయోగ నిష్ఠయందురు ఇఁకను పరిరాజ యోగంబను నది తారకసాంఖ్యా మనస్కంబులన మూడువిధంబులైయుండు. ఇందు తారకం బనఁగ; మంత్ర యోగంబులై యుండు ప్రణవమే తారకంబు. తారకమనఁగా భవసాగరమును దాటించునది గనుక తారకమని జెప్పంబడు. ఇది యనాదుబిందుకళలనఁబడు. ఎట్లనిన, [ప్రాణ వాయువుఘోష మే ప్రణవనాదము ఇదియే అకారము.] [మనస్సునకు అగ్రమైస్థిరమైనబుద్ధియె బిందువు. ఇదియే ఉపకారము] [ఇందు ప్రతిబింబమైన ఆత్మయే కళయనఁబడు. ఇదియె ఉపకారము.] మూడుంగూడి ప్రణవమౌను ఇంకసాంఖ్యమనఁగా నాత్మానాత్మ విచారమనంబడు. అమనస్క మనఁగా బ్రహ్మైక్యంబై, మనోరహితంబయిన యనుభవజ్ఞానంబు. ఇవి రెండుజ్ఞానోపదేశంబున దెలియఁబడును. ఇందుకతి వర్ణాశ్రముఁ డధికారి. అనిన స్వామీ? వర్ణములనగా నెట్టిదో తెలుపవలయుననిన, శ్రీగురుండిట్లనియె.

భక్తియోగ ప్రకరణము సమాప్తము



## వర్ణాశ్రమ ప్రకరణము.

నిరాలంబోపనిషత్తు॥ [జాతరితీచ॰ - నరక్తస్యనమాంసస్య స్థూల శరీరస్యనానా జాతస్యకళారోహాఁ కల్పనీయః] అని చెప్పియున్నది గనుక జాతులు కల్పనలనియెరుంగునది, అనిన స్వామీ? వర్ణంబు లెటువలె కల్పితంబులయ్యె లోకంబున శ్రీశూద్రాదులకు మంత్రాధికారంబు లేదనియు - వేపచెట్టుకు పాలుశర్కరపోసి పెంచినను దానిచేదు యెటువలె పోనోవదా - ఆటువలె నెన్నిసాధనములు చేసినను శూద్రత్వమునకు నివృత్తి లేదనియు ముఖమునగాదు

బుట్టినవారు బ్రాహ్మణులనియు - భుజములందు బుట్టినవారు క్షత్రియు, లనియు. ఉరువులందు బుట్టినవారు వైశ్యులనియు. పాదములందుబుట్టినవారు శూద్రులనియు బ్రాహ్మణులే మంత్రాధికారులని చెప్పుటచే నితరవర్ణములకు, మోక్షము లేదనిపుట్టెడు సంశయమును నివర్తిచేయ దేవరవారే కర్తలని వేడుకొనిన. శిష్యుని సంశయమునివర్తిచేయ దలచి గురుండిట్లనియె. ముఖమున బుట్టినవారే బ్రాహ్మణులనిన బ్రాహ్మణులకు నాదిపురుషుఁడగు బ్రహ్మ శ్రీహరి నాభియందు బుట్టినటుల సర్వశాస్త్రములయందు జెప్పుటజేసి బ్రహ్మకు బ్రాహ్మణత్వము లేకపోవుచున్నది. ఇదియునుగాక శ్రీహరిపాదములందుబుట్టిన దంగజదత్తును పావనముచేయుచు సర్వదేవతాభిషేకములకు మూలమై జగత్పూజ్యమైన గంగకును శూద్రత్వము సంభవింపుచున్నది. ఇదియును గాక భాగవతమందు తృతీయ్య స్కంధములో॥ సీ॥ [అరవిందసంభవు నంగుష్ఠమునదక్షుఁ డూరువువలనను నారదుండు] అనిచెప్పియున్నది గనుకదక్షబ్రహ్మకున్ను శూద్రత్వము సంభవింపుచున్నదిగాన నిటులన గూడదు, అన్నట్లాయనా ముఖమందుబుట్టిన బ్రాహ్మణులొకరును లేదు. క్షత్రియులు భుజములంద పుట్టిరంటివా క్షత్రియులందు సూర్యవంశమనియు, చంద్రవంశమనియును రెండువిధములైయుండు. సూర్యవంశమున కాదిసూర్యుఁడు కశ్యపబ్రహ్మకు పుట్టినటుల శాస్త్రము జెప్పుచున్నయది. చంద్రుఁడు అత్రిమహాఋషికి బుట్టినటుల శాస్త్రములఁ జెప్పియున్నదిగాని భుజములందు బుట్టినటుల జెప్ప లేదుఁగాన వీరిరువరు క్షత్రియులు కాకపోవుదురు అయితే॥ శ్రు॥ [బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్] అనెడి శ్రుతుల కర్థంబెట్లనిన; శ్రు॥ [విశ్వంనారాయణందేవ] మనఁగా భగవంతుఁడు విరాట్పురుషుఁడవుటచే విశ్వమే శరీరమాయెను - శరీరమునకు ముఖముప్రధానమవుటచే నుత్తమమనియు,భుజములుమధ్యమమనియు, ఊరుపులు అధమమనియు, పాదము లధమాధమము లనియుఁ జెప్పఁబడును-అందువలనలోకంబున నీశ్వర సృష్టియైన జనులందుశాంతిశమదమాది వివేకముగలిఁగి బ్రహ్మనిష్ఠగలవారు త్తములనియు, అందుక నిష్ఠవివేకులు మధ్యములనియు, అందుకొరఁత వివేకులు అధము

లనియు కేవల శూన్యవివేకులు, అధమాధములనియునునిదియే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులనంబడు చాతుర్వర్ణము లీశ్వరునకు నాలుగవయవములుగా విభజించిరి అదెట్లనిన॥ శ్రు॥ [చంద్రమామనసోజాతశ్చ క్షో సూర్య అజాయత] అనిమనస్సున చంద్రుఁడు, చక్షువుల సూర్యుఁడునుం బుట్టిరని శాస్త్రములందున్న నర్థము జేయునెడల చంద్రుండు అత్రికొమారుడనియు సూర్యుఁడు కశ్యపునకుఁ బుట్టినాఁడని యెఱుఁగునటుల. ముఖబాహు. ఊరు. పాదములందు బ్రహ్మ-క్షత్రియ. వైశ్య. శూద్రాదులు పుట్టిరనియున్న నటువలె యర్థము జేయరాదు ॥ శ్లో ॥ [బ్రాహ్మణో భగవాన్ రుద్రో క్షత్రియః పరమోహరిః । వైశ్యః పితామహశ్చైవ యింద్రశ్శూద్రశ్చ జాయతే]॥ అని యింద్రునకు శూద్రత్వము చెప్పుచున్నది యిటువలె నర్థముచేసిన ట్టాయునా, ఇట్టిశూద్రభోగ్యంబైన స్వర్గాదులకై బ్రాహ్మణులు జేయు యజ్ఞయాగాది క్రతువులకును దోషము గలుఁగుచున్నది. బ్రాహ్మణులకును, శూద్రత్వము సంభవింపుచున్నది గనుక నిటువలె నర్థము జేయరాదు. బ్రాహ్మణ, శూద్రులనఁగా; జ్ఞానాజ్ఞానము లనియెఱుంగునది. ఇందుకుదృష్టాంతము. పద్యం॥ "అజ్ఞానమే శూద్రత్వము సుజ్ఞానమె బ్రాహ్మణుండు శ్రుతులనువినరా। అజ్ఞానముడిగి వాల్మికి సుజ్ఞానపు బ్రాహ్మఁడాయె చూడర వేమా" అనిచెప్పియున్నది. అనిన శిష్యుండిట్లనియె, స్వామీ శూద్రత్వము స్వాభావికమా? ఆగంతుకమా? యనిన, వత్సా? ఇంత దెలిపియు నీసంశయము వీడలేదు. మరలవినుమని యిట్లనియె. స్వాభావికమనఁగా, వేపచెట్టుకు చేదుస్వాభావికము; అగ్నికి వేడిమి స్వాభావికము, ఈశ్వరభావమునకునివర్తిలేదు. కలదనినస్వరూపమునకు హానివచ్చును. ఎటువలెననిన చేదును విడిచి వేపచెట్టుండదు. వేడిమివిడిచి యగ్నియుండదు. ఇటువలెనే శూద్రత్వమే స్వాభావికమన్నను. శాస్త్రాదులందు శూద్రత్వమునకునివృత్తిచెప్పి యుండుటచే స్వాభావికమనఁగూడదు, ఇందు కుదృష్టాంతము, భారతమందు శాంతిపర్వములో॥ పద్యం॥ [పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును నిజముశూద్రుకంటె నీచముఁడు। సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు నతఁడు సద్విజుండనిరి మునులు] అని

శూద్రత్వమునకు సత్య, శౌచ, శాంతి, శమదమాది ధర్మంబులచే నివృత్తనియు, శ్లో॥ [నశూద్రాభగవద్భక్తా విప్ర భాగవతా స్మృతాః। సర్వవర్ణేషుతే శూద్రా ఏహ్యాభక్తాజనార్దనే] అని భగవద్వాక్యమున్నది గాన భక్తిచేతను, శూద్రత్వమునకు నివృత్తినికల్గి, బ్రాహ్మణత్వము గలుగుననియు, జెప్పఁబడియె. మంత్రములకధికారముగలదనుటకు దృష్టాంతముగలదు ॥ కపిలిగీతాసు. శ్లో॥ [మంత్రాధికారః ప్రథమంసర్వత్రస్యాన్న సంశయః। బ్రాహ్మణ క్షత్రియోవైశ్యో శూద్రోవాప్యం త్యజోథవా॥] అనిమంత్రముల కధికారము గలదు. సర్వవర్ణస్థులకు భగవదుపాసనచే మోక్షము గలదనుటకు దృష్టాంతముగలదు ॥ భగవద్గీతాసు. శ్లో॥ "మాంహిపార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః। స్త్రియో వైశ్యా స్తథాశూద్రా స్తేపీయాంతిపరాంగతిం" అనఁగా నన్ను ఆశ్రయించిన సర్వవర్ణస్థులకును మోక్షముగలదని శ్రీకృష్ణమూర్తి అర్జునుఁడితోఁ జెప్పె గాన మోక్షముకలదు. సర్వజాతులకు భగన్నిష్ఠచే జన్మరహితమౌ ననుటకు దృష్టాంతముగలదు. శ్లో॥ "బ్రాహ్మణ క్షత్రియో వైశ్యోశూద్రో చండాలఏవచ। దృఢాభ్యాస కరోనిత్యం పునర్జన్మ నవిందతి॥" అనగా బ్రాహ్మణాది చండాలాంత డెవ్వరైననుదృఢాభ్యాసము సతతముజేసినట్టులైన జన్మరహితమౌనని చెప్పియున్నది ఇటుండుటంబట్టి శూద్రత్వము స్వాభావికమని చెప్పఁగూడదు, సద్ధర్మ ప్రయత్నములచే శూద్రత్వ ద్యోతకమైన యజ్ఞానమునకు నివృత్తిగలిగి బ్రాహ్మణత్వము గలుఁగునని శాస్త్రములు జెప్పుచున్నవిగనుక నాగంతుక మనే జెప్పవలయును. అనిన యోపరమగురువా బ్రాహ్మణత్వము స్వాభావికమా, ఆగంతుకమాయనిన. వత్సా, ఇంకనునీసంశయంబు తీరలేదు; బ్రాహ్మణత్వమును, ఆగంతుకమనే చెప్పవలయు. ఎటులనిన ॥ శ్లో॥ "సంధ్యా యేనన విజ్ఞాతా సంధ్యా యేనానుపాశితా। జీవమానోభ వేచ్ఛూద్రో మృతశ్వానోభిజాయతే" అనఁగా; సంధ్యయెఱుఁగని వాఁడును సంధ్యవార్చని వాఁడును, బ్రతికియుండఁగానే శూద్రుఁడనియు, చచ్చికుక్కయౌనని జెప్పియున్నది. ఇదియునుగాక "పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును నిజము శూద్రునికంటె నీచతముఁ

డు"॥ అని భారతమందు చెప్పుటచే సంధ్యవిడుచుట చేతను, పాపపు నడతలచేతను బ్రాహ్మణత్వ మెత్తుబడిపోయి శూద్రత్వము సంభవించును గనుక బ్రాహ్మణత్వమును స్వాభావికమనఁ గూడదు; ఆగంతుకమనే చెప్పవలయును: ఆగంతుకమనఁగా నేమనిన: ఒక దేవదత్తునకు వ్యాధిగలిఁగి, అరోచకముచే భక్ష్య, భోజ్య, లేహ్య, పాయసాన్నములు భుజించుట కనధికారియై, దివ్యౌషధంబులచే వ్యాధితీరి యెప్పటివలె భక్ష్య. భోజ్య, లేహ్య, పాయసాన్నములు భుజించుట కధికారము గలిఁగినపుడు పూర్వపుఅరోచక మాగంతుక మనఁబడు. అటువలె నాగంతుకమైన శూద్రత్వము శాంతి,శమ, దమ, భగవదుపాసనలచే నివృత్తమై వేదాధ్యయన మునకును, మంత్రోపాసనలకును అధికారము గలుగును. అనిన, శిష్యుఁడు, స్వామీ? వేదాధ్యయన మునకుఅధికారము గలదని ప్రమాణంబు గలదాయనిన; కలదు॥ బ్రహ్మోపనిషత్తు॥ "సశిఖావపనంకృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః। యదక్షరం పరంబ్రహ్మ తత్సూత్రమితిధారయేత్ । సూచనాత్సూత్రమిత్యాహు స్సూత్రంనామ పరంపదం। తత్సూత్రంవిదితం యేనసవిప్రో వేదపారగః"॥ అనఁగా (శిఖ) యనగా శరీరమునకు పైనుండు కేశములను త్యజించుటకాదు. శరీరతత్వమునకు సంత్యమై మాయామయమైన మనస్సును త్యజించుటయే. (శిఖావపనం) అనగా మనస్సును బ్రహ్మమందు లయము జేయుట. (సూత్ర) మనగా సర్వభూతాంతర్యామియైన బ్రహ్మమందు సమస్తమును గుచ్చంబడి యుండుటచే సూత్రమను నామముగలిఁగెను. ఏలాగనిన; ఒకదారమందనేకములగు పూసలు గుచ్చబడియున్నట్లు॥ శ్లో॥ "ఏనసర్వమిదం ప్రోతం సూత్రే మణిగణాఇవ" అనిగీతలలో జెప్పియున్నది గాన నిట్టి పరబ్రహ్మమును సూత్రమును మనస్సున నెవరుధరించుచుందురో వారే వేదాధ్యయనమున కధికారులు॥ శ్లో॥ "సవిప్రో వేదపారగః" అనుటకర్థమాయెను. తక్కిన సూత్రధారుల కధికారము లేదు. కలదంటివేని; తంతువాయునకును అధికారము గలుఁగవలయు.అట్లులేదు గనుక నాలాగనరాదు. ఇదియునుగాక; బ్రాహ్మణత్వము మూఁడువిధంబులై యుండు. ఎట్లనిన; స్వబ్రాహ్మణులనియు, కర్మబ్రాహ్మణు లనియు

వేషబ్రాహ్మణులనియు, మూఁడువిధములు. వేషబ్రాహ్మణు లనఁగా నెట్టివారనిన; రాత్రియందు నాట్యకాలంబున బ్రాహ్మణవేషము ధరించి బ్రాహ్మణ చిహ్నములే కనుపఱచి, ప్రాతఃకాలమం దెప్పటివలె శూద్రుఁడై యుండు వేషధారింబోలువారు. కర్మబ్రాహ్మణులనఁగా; స్వప్నజాలమైన జగత్తునందు కర్మములఁజేసుకొంచు బ్రాహ్మణ చిహ్నములు కనుపఱచి జ్ఞానంబైన సహజావస్థయందు బ్రాహ్మణ్యంబులేక జన్మాదులెత్తుకొంచు, తాముజెడి ఇతరులకును మీకధికారము లేదు; మీరు భగవన్నిష్ఠచేసితిరేని పాపమనుభవించెదరని భయపఱచుచు. తమనునమ్మి మోక్షేచ్ఛచే పూజించువారి మోక్షప్రయత్నమును విఘ్నముజేయుచు, దేహవర్ణాభిమానులై యుండువారు, ఇందుకుదాహరణము. నిరాలంబోపనిషత్తు॥ "మూఢయితిచః, దేహవర్ణాశ్రమకర్తృత్వ, భోక్తృత్వ, మమత్వాభిమానాహంకార భావనయా రూఢోమూఢః" అనిచెప్పియున్నది. ఇఁక స్వబ్రాహ్మణులనఁగా; బ్రాహ్మణులనగా నర్థమేమన్నను; బ్రహ్మమును మననము జేయువారనియు, బ్రహ్మోపనిషత్తున జెప్పియున్నట్లు బ్రహ్మమును సూత్రముగా ధరియించినవారనియు॥ "శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతేద్విజః। వేదాభ్యాసేన విప్రాణాం బ్రహ్మజానాతి బ్రాహ్మణః" అని బ్రహ్మంబెఱిగినవారె బ్రాహ్మణులనియు. వజ్రసూచికోపనిషత్తు॥ "శమదమా ద్యనేకసద్గుణ విశిష్టస్సన్, నిష్కళంకం, నిరంజనం, నిర్వికారం, అద్వైతం, ఏకం, ఆకాశవత్సర్వత్రభా సమానం, పరబ్రహ్మమోజానాతి సఏవబ్రాహ్మణః" అనియిట్టివారే బ్రాహ్మణులని చెప్పుచున్నది. గనుక బ్రాహ్మణ్యంబునకు తపస్సేప్రధానంబు. ఇందుకు నిదర్శనము. శ్లో॥ ఊర్వసీగర్భసంభూతో వసిష్ఠస్సమహామునిః। తపసాబ్రాహ్మణోజాత స్తస్మాజ్జాతిరకారణం। శుకస్యగర్భసంభూత శ్శుకయోగి మహామునిః। తపసాబ్రాహ్మణోజాత స్తస్మాజ్జాతిరకారణం॥ శశకీగర్భసంభూతో గౌతమస్సమహామునిః। తపసాబ్రాహ్మణోజాత స్తస్మాజ్జాతిరకారణం॥ రజకీగర్భసంభూతో నారద స్సమహామునిః। తపసాబ్రాహ్మణోజాత స్తస్మాజ్జాతిరకారణం॥ శునకీగర్భసంభూత శ్శౌనకస్సమహామునిః। తపసా బ్రాహ్మణోజాత స్తస్మాజ్జాతిరకారణం॥ కైవర్తీ గర్భసంభూతో

వేదవ్యాసో మహామునిః। తపసా బ్రాహ్మణో జాత స్తస్మాజ్జాతిర కారణం” అని జాతిప్రధానము కాదు; తపస్సే బ్రాహ్మణ్యమని చెప్పియున్నది. ఇందువలన సూతునకు, బ్రాహ్మపీఠమిచ్చి శౌనకాదిమహాఋషులు సర్వధర్మముల శ్రవణము చేసిరి. బ్రాహ్మణులనే నామము వలన గలిగెనసిన విష్ణు నుపాసించువారికి వైష్ణవులనియు, శివునుపాసించువారికి శైవులనియు, శక్తినుపాసించువారికి శాక్తేయులనియు, గణపతినుపాసించు వారికి గాణాపత్యులనియును నెటువలెనామముగ్లైనో అటువలెనే పరబ్రహ్మము నుపాసించువారికి బ్రాహ్మణులని నామముగలైను. ఇట్టిసద్బ్రాహ్మణులకే కారణాచార్యులనే నామము. ఎందువలననిన; గురుశిష్యులనగా భ్రమరకీటక న్యాయము గనుక శిష్యులను తమరూపము చేసుకొనుటకు సామర్థ్యము గలిగియుండును ఇతరులు దేహాభిమానులవుటచే తనువద్ద జేరినవారిని చెరచి, తామును చెడుదురు - ఎటువలెననిన. ఈత వచ్చిన వారి సహాయముచే నదిదాటినట్లుగా కారణాచార్యుల జేరిన వారు భవవారిధిని దాటుదురు. ఈతరానివాని నమ్మి తానును వాడును మునిగినటువలె లోకగురువుల నమ్మినవారు భవవారిధిని మునుగుదురు. ఆత్మయైన తనకు సచ్చిదానందమే స్వాభావికము, బ్రాహ్మణశూద్రాది వర్ణము లాగంతుకములని యెఱుంగునది. ఈవిచారమునకు ఫలంబేమనిన; సర్వజనులకు మంత్రాధికారము గలదనియు సర్వజనులకు భగవదుపాసనచే మోక్షము గలుగునని నిస్సందేహముగా తెలిసి భగవన్నిష్ఠులై ప్రయత్నము జేసి తత్వవివేకియై మోక్షముపొందుటయే, అనినవిని, శిష్యుండు హే దీనదయానిధే? తత్వవివేకమనగా నెట్టిది; అనిన శ్రీగురుండిట్లనియె॥

వర్ణాశ్రమప్రకరణం సమాప్తం.

---

## తత్వప్రకరణం.

శ్లో॥ పంచైతాని దశేంద్రియాణి విషయాః ప్రాణాష్షడప్యాశ్రయాః। రాగాష్టాకరణాని షట్చవిషయాః సప్తవ్యామిధాతవః। నా

డీమండల మీషణత్రయ గుణావస్థాశ్చ తాపత్రయం । కోశాః పంచ తనుశ్చ షణ్ణవతికం తత్వానిజీవాత్మనః॥ ఇవే-౯౬-తత్వములు॥

## తత్వముల వివరం.

| | |
|---|---|
| ౫—పంచభూతములు | ౭—ధాతువులు |
| ౫—జ్ఞానేంద్రియములు | ౦—నాళ్లు |
| ౫—కర్మేంద్రియములు | ౩—మండలములు |
| ౧౦—విషయములు | ౩—ఈషణములు |
| ౧౦—ప్రాణాదివాయువులు | ౩—గుణములు |
| ౬—చక్రములు | ౩—అవస్థలు |
| ౮—రాగములు | ౩—తాపత్రయములు |
| ౪—అంతఃకరణములు | ౫—కోశములు |
| ౬—షడూర్ములు | వెరశితత్వములు—౯౬ |

ఈతత్వములతో కూడిన ఈశరీరమే నేననువాఁడు, జీవుఁడు.

## ఘటప్రదీపికా లక్షణం మనుష్యప్రమాణం.

| | |
|---|---|
| ౯౬—అంగుళముల ప్రమాణం | ౮—పలములగుండెలును |
| ౭—జానలపొడవు | ౪౦—పలములరుధిరమును |
| ౪—జానలవలం | ౩౬౦—పలములమాంసమును |
| ౩౩—కోట్లురోమద్వారములు | సోలెడుపైత్యమును |
| ౩౧—మూళ్ల పేగును | అరసోలెడుశ్లేష్మమును |
| ౯౨—నరములును | సోలెడుశుక్లమును |
| ౭౦—ఎముకలును | |

ఇన్నిటితో కూడుకొని యుండునది యీ స్థూలశరీరము.

## పంచభూత వివరము.

పంచభూతములు —పృథివి, ఆపః, అగ్ని, వాయువు, ఆకాశము.
స్థలములు.—పిక్కలు, తొడలు, కుక్షి, కంఠము, ముఖము.
వర్ణములు —పీతవర్ణము, శ్వేతవర్ణము, రక్తవర్ణము, నీలవర్ణము,
ఇంద్రనీలవర్ణము.
అధిదేవతలు. —బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుఁడు.

| | |
|---|---|
| గుణములు. | శబ్దము, శబ్దము, శబ్దము, శబ్దము, శబ్దము.<br>స్పర్శము, స్పర్శము, స్పర్శము, స్పర్శము, శబ్దము.<br>రూపము, రూపము, రూపము, స్పర్శము, శబ్దము.<br>రసము, రసము, రూపము, స్పర్శము, శబ్దము.<br>గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము. |

ధర్మములు.—కఠినము, ద్రవము, ఉష్ణము, తిరుగుట, బయలు.
కర్మములు.—ధారణము, పిండీకరణము, పచనము, చలనము, తెరపిచ్చుట.
శక్తులు.—క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ఆదిశక్తి, పరాశక్తి.
మాతృకలు.—ల-కారం, వ-కారం, ర-కారం, య-కారం, హ-కారం.

## జ్ఞానేంద్రియముల వివరము.

ఇంద్రియములు.—శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, అధ్యాత్మము.
విషయములు.—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, ఆదిభూతము.
అధిదేవతలు.—దిక్కులు, వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వినులు, ఆది దైవము.

## కర్మేంద్రియముల వివరము.

ఇంద్రియములు.—వాక్కు, పాణి, పాదములు, ఉపస్థ, పాయువు, అధ్యాత్మం.
విషయములు.—వచనము, దానము, గమనము, ఆనందము, విసర్గము, ఆదిభూతం.
అధిదేవతలు.—అగ్ని, ఇంద్రుఁడు, ఉపేంద్రుఁడు, ప్రజాపతి, మృత్యువు, ఆదిదైవము.

## అంతఃకరణ చతుష్టయ వివరము.

అంతఃకరణము.—మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అధ్యాత్మము.
విషయములు.—తలంచుట, నిచ్ఛయించుట, చింతించుట, నేనని అభిమానించుట, ఆదిభూతము.
అధిదేవతలు.—చంద్రుఁడు, బ్రహ్మ, క్షేత్రజ్ఞుఁడు, రుద్రుఁడు, ఆదిదైవము.
స్థానములు.—హృదయము, నాభి, కంఠము, వాక్కు, ఆదిదైవము.

వర్ణములు.—నీలవర్ణము, కృష్ణవర్ణము, శ్వేతవర్ణం, రక్తవర్ణము, ఆదిదైవము.

### —పంచభూత సంబంధ స్థూలదేహ వివరము.—

తమోగుణములో తమోగుణ స్థూలభూత పంచీకరణము.

పృథివి.—ఎముకలు, మాంసము, చర్మము, నరములు, రోమములు, ఈ ౫ పృథివిసంబంధములు.

ఉదకము.—చొల్లు, మూత్రము, చెమట రక్తము, శుక్లము, ఈ ౫ జలసంబంధములు.

అగ్ని.—ఆకలి, దాహము, నిద్ర, ఆలశ్యము, స్త్రీసంగమము, ఈ ౫ అగ్నిసంబంధములు.

వాయువు.—పరుగుట, తిరుగుట, ముడుచుట, చాపుట, దాటుట, ఈ ౫ వాయుసంబంధములు.

ఆకాశం.—రాగము, ద్వేషము, భయము, లజ్జ, మోహము, ఈ ౫ ఆకాశసంబంధములు.

### —ప్రాణాదివాయువుల వివరం.—

| ప్రాణపంచకము. | స్థానములు. |
|---|---|
| ప్రాణవాయువు | హృదయస్థానము |
| అపానవాయువు | గుదస్థానము |
| వ్యానవాయువు | శరీరమంతటను |
| ఉదానవాయువు | కంఠస్థానము |
| సమానవాయువు | నాభిస్థానము |

| ఉపవాయువులు. | మహావాయువులు. |
|---|---|
| నాగవాయువు | వజ్రాఁడు |
| కూర్మవాయువు | ముఖ్యుఁడు |
| కృకురవాయువు | అంతర్యామి |
| దేవదత్తవాయువు | ప్రపంచకుఁడు |
| ధనంజయవాయువు | మహాభూతుఁడు |

## దశవిధ నాడీ వివరము.

| నాళ్లు. | అధిదేవతలు. | నాళ్లు. | అధిదేవతలు. |
|---|---|---|---|
| ఇళ | హరి | జింహ్వా | వరుణుఁడు |
| పింగళ | బ్రహ్మ | అశ్విని | దిగ్దేవత |
| గాంధారి | రుద్రుఁడు | అలంబ | ఈశాన్యుఁడు |
| సుషుమ్న | ఇంద్రుఁడు | కృకంఠ | భూమి |
| హస్తి | వరుణుఁడు | శంఖని | చంద్రుఁడు |

## అరిషడ్వర్గముల వివరము.

అరిషడ్వర్గ విషయములు.

కామము.—కామమనే చిత్తవృత్తి సకలపదార్థములందు యిచ్ఛగలిగి యుండుట.

క్రోధము.—క్రోధమనే చిత్తవృత్తి తాను సంపాదించిన పదార్థమునకు విరోధము తలంచే వారిమీాద వచ్చేకోపము.

లోభము.—లోభమనే చిత్తవృత్తి తాను సంపాదించిన ధన మన్యులకు పెట్టకూడదనుట.

మోహము.—మోహమనే చిత్తవృత్తి తాను సంపాదించిన ధనమందు విశేషకాంక్ష గల్గియుండుట.

మదము.—మదమనే చిత్తవృత్తి ఐశ్వర్యమువలన పెద్దలను లక్ష్యపెట్టక గర్వించియుండుట.

మాత్సర్యము.—మాత్సర్యమనే చిత్తవృత్తి యొకరిమేలుచూచి సహించకయుండుట.



మండలత్రయములు.—సూర్యమండలము, చంద్రమండలము, అగ్నిమండలము.

వీనివర్ణములు.—రక్తపీతవర్ణము, శ్వేతకర్బురవర్ణము, కృష్ణశ్యామలవర్ణము.

దోషత్రయము.—వాతము, పిత్తము, శ్లేష్మము.

వీటి అధిదేవతలు.—బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు.

యీషణాత్రయ వివరము.— దారేషణ = భార్యాపేక్ష, ధనేషణ = అర్థాపేక్ష, పుత్రేషణ = పుత్రాపేక్ష.

## షట్చక్రముల వివరము.

| షట్చక్రములు | అధిదేవతలు | దళాలు | బీజములు | వర్ణములు | స్థానములు | శక్తులు | హంస |
|---|---|---|---|---|---|---|---|
| ఆధారము | వినాయకుఁడు | ౪ | వ-శ-ష-స ఓం | పసుపు వర్ణము | గుదము | శాకినీ శక్తి | ౬౦౦ |
| స్వాధిష్ఠానము | బ్రహ్మ | ౬ | బ- మొదలు ల-న | రక్తవర్ణము | ఉపస్థము | డాకినీ శక్తి | ౬౦౦౦ |
| మణిపూరకము | విష్ణువు | ౧౦ | డ-ఫ-మ | హారిత వర్ణము | నాభి | లాకినీ శక్తి | ౬౦౦౦ |
| అనాహతము | రుద్రుఁడు | ౧౨ | క-ఠ-ఠ | మేఘ వర్ణము | హృదయము | రాకినీ శక్తి | ౬౦౦౦ |
| విశుద్ధము | మహేశ్వరుఁడు | ౧౬ | స్వరములు వా | జ్యోతి వర్ణము | కంఠము | ఢాకినీ శక్తి | ౧౦౦౦ |
| ఆగ్నేయము | సదాశివుఁడు | ౨ | హంక్షం యం | నీలవర్ణము | భ్రూమధ్యము | హాస్తినీ శక్తి | ౧౦౦౦ |
| సహస్రారము | శ్రీగురుఁడు | ౧౦౦౧ | ఓంకారము ఉ-ఓం | మాణిక్య వర్ణము | బ్రహ్మరంధ్రము | యాకినీ శక్తి | ౧౦౦౦ |

వెరశి.—౨౧౬౦౦.

## దేహత్రయ వివరము.

| దేహత్రయము | అవస్థాత్రయము | ఆత్మత్రయము | స్థానత్రయము | అభిమానత్రయము | గుణత్రయము | వర్ణత్రయము | తత్వములు | దైవత్రయము | మాతృకాత్రయము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| స్థూలము | జాగ్రత | జీవాత్మ | నేత్రము | విశ్వుఁడు | రాజసము | రక్తవర్ణము | ౨౪ | బ్రహ్మ | అ-కారము |
| సూక్ష్మము | స్వప్నము | అంతరాత్మ | కంఠము | తైజసుడు | సాత్వికము | శ్వేతవర్ణము | ౧౭ | విష్ణువు | ఉ-కారము |
| కారణము | సుషుప్తి | పరమాత్మ | హృదయము | ప్రాజ్ఞుఁడు | తామసము | నీలవర్ణము | ౧ | రుద్రుఁడు | మ-కారము |

## మలత్రయము వివరణము.

అణుమామలము.—ఎఱుకమఱపులం జేసునదియు - కామక్రోధాలతో కూడియుండునది.

మాయామలము.—పరధన పరస్త్రీలయం దాసక్తిగలిగియుండు నది యు, కపటముతోనుండునది.

కార్మికమలము.—మునుపటి రెండుగుణములు - కలిగి - పుణ్యాపాపములు చేసునది.

—పంచకోశముల వివరము.—

అన్నమయకోశము.—పృథివిలో నుత్పత్తి రజోగుణము జాగ్రదవస్థ-స్థూలదేహము.

ప్రాణమయకోశము.—జలములో నుత్పత్తి- సత్వగుణము- స్వప్నావస్థ - సూక్ష్మదేహము- ప్రాణాదివాయువులు ౫ కర్మేంద్రియములు ౫.

మనోమయ కోశము.—అగ్నిలో నుత్పత్తి - సత్వగుణము - స్వప్నావస్థ సూక్ష్మదేహము - మనస్సును - జ్ఞానేంద్రియములు ౫.

విజ్ఞానమయకోశము.—వాయువులోనుత్పత్తి - సత్వగుణము - స్వప్నావస్థ సూక్ష్మదేహము బుద్ధియు - జ్ఞానేంద్రియములు ౫.

ఆనందమయకోశము.—ఆకాశములోనుత్పత్తి - తమోగుణము- సుషుప్త్యవస్థ - కారణదేహము - అవిద్య ౧.

చతుర్విధయోనుల వివరము.

జరాయుజములనఁగా - మావిలోబుట్టిన - మనుష్యపశ్వాదులు.
స్వేదజములనఁగా - చమటనఁబుట్టిన - చీరపేను మొదలైనవి.
అండజములనఁగా - గుడ్లలోబుట్టిన - పక్షి - భుజంగమత్స్యాదులు.
ఉద్భిజ్జములనఁగా - వృక్ష - లతాదికములు.

షడూర్ముల వివరము.

ఆకలి - దప్పి............ ఇవిప్రాణధర్మములు.
శోకము, మోహము......ఇవిమనోధర్మములు.
జన్మము, మరణము...... ఇవి దేహధర్మములు.

షడ్భావముల వివరము.

అస్తి - గర్భమందుండుట......... జాయతే - పుట్టుట.
వర్ధతే - పెరుగుట.............. పరిణమతే - వృద్ధిబొందుట.
అపక్షీయ్యతే - కృశించుట...... వినశ్యతి - నశించుట.

### సప్తధాతువులు.

రసము, రుధిరము, మాంసము. మేధస్సు - అస్థి - మజ్జ - శుక్లము.

ఈతత్త్వములతోఁ గూడినదీశరీరము. ఇదేఅనాత్మ, అసజ్జడదుఃఖస్వరూపమయిన యీదేహమే తానను అజ్ఞానమే జీవాత్మ - యిట్టి దేహము కన్నను విలక్షణమైనఆత్మే తానని యెఱుఁగుట జీవన్ముక్తి, అనిన శిష్యుఁడు, స్వామి? నిర్వికార బ్రహ్మమం దీజీవేశ్వర జగంబెట్లు కల్గెనో; దెలిపి కృతార్థునిం జేయుమనిన, శ్రీగురుండిట్లనియె.

తత్త్వప్రకరణం సమాప్తం.

---

### ఉత్పత్తి ప్రకరణము.

శుద్ధబ్రహ్మమందు (అగ్నియందూష్ణమువలె) అభిన్నముగా అణగియుండెడి శక్తియొకటికలదు, ఆశక్తిపురుష సన్నిధానమందు స్త్రీలకు సుఖము జనించు లాగునఁ బ్రహ్మ సన్నిధానమున లక్షణశూన్యమైన యాశక్తియందు వంధ్యాపుత్ర న్యాయముగా రజ్జువందు సర్ప భ్రాంతి తోఁచినట్లు మూలప్రకృతియని యొకశక్తి పుట్టినది, ఆమూల ప్రకృతి వికృతమైన సత్వరజస్తమములతోఁ గూడియుండును ఆమూల ప్రకృతియొక్క సత్వగుణమునకు మాయయనియు,రజోగుణమున కవిద్యయనియు, తమోగుణమునకు విక్షేప, ఆవరణశక్తియనియు పేరు యీత్రిగుణకల్పన యెటువలెననిన.



౧.—మూలప్రకృతి సత్వగుణ కల్పన.

ఇదియే మాయయనియు సర్వజ్ఞ ఉపాధియనియు ఈశ్వరుని కారణ శరీరమనియు జెప్పఁబడును. ఈమాయయందు నిర్మల జలప్రతిబింబమువలె బ్రహ్మము బింబించినందుకు సర్వజ్ఞుఁడైన ఈశ్వరుఁడని నామమాయెను. ఈసత్వగుణమాయకు సత్వరజస్తమో గుణముల ని మూఁడుగుణములు కలవు. ఈమాయయొక్క సత్వగుణమందు ప్రతిబింబమైన ఈశ్వరుఁడు జగత్తును రక్షించుటచేత విష్ణువని పేరు. ఈ మాయయొక్క రాజసమందు ప్రతిబింబమైన ఈశ్వరుడు జగత్తును సృష్టించుటచేత బ్రహ్మయని పేరు. ఈమాయయొక్క తామసమందు ప్రతిబింబమైన ఈశ్వరుఁడు జగత్తును లయముచేయుటచేత రుద్రుడని పేరు గల్గెను. యిదే మూల ప్రకృతియొక్క సత్వగుణకల్పన.

౨.—మూలప్రకృతి రాజసగుణ కల్పన.

ఇదియె అవిద్యయనియు కించిజ్ఞ ఉపాధియనియు జీవుని కారణ శరీరమనియు, అనేక భిన్నమైయుండును. ఈయవిద్యయందు మలిన జల ప్రతిబింబమువలె బ్రహ్మము బింబించినందుకు కించజ్ఞుఁడనియు చిదాభాసకజీవుఁడనియు నామమాయెను. ఈరజోగుణావిద్యకు సత్వరజస్తమోగుణములని మూఁడుగుణములుగలవు - ఈయవిద్యయొక్క సత్వగుణమందు ప్రతిబింబమైన జీవులు తత్వజ్ఞాన నిష్ఠులవుదురు. ఈ అవిద్యయొక్క రాజసమందు ప్రతిబింబమైనజీవులుకామక్రోధులై కర్మనిష్ఠులౌదురు. ఈయవిద్యయొక్క తామసమందు ప్రతిబింబమైన జీవులు ఆలస్య నిద్ర బద్ధకులైన పశుప్రాయులౌదురు. ఇదేమూల ప్రకృతియొక్క రాజసగుణకల్పన.

3.—మూలప్రకృతి తమోగుణకల్పన.

ఇదియె ఆవరణ, విక్షేపశక్తులను భేదముగా రెండుగల్గెను అందు ఆవరణశక్తితత్వజ్ఞానిని, ఈశ్వరునివినా తక్కిన జీవులయొక్క తెలివిని మరిపించి-దేహత్రయములనున్ను నేనని అభిమానించుచు నుండును- ఇదియెఅహంకార గ్రంధియనియు- సంసారబంధమనియు జెప్పఁబడును ఇంకవిక్షేప శక్తియందు శబ్ద తన్మాత్రమగు నాకాశము పుట్టెను- ఆకాశమందు స్పర్శతన్మాత్రమైన వాయువుపుట్టెను. వాయువునందుహ

పతన్మాత్రమైన అగ్నిపుట్టెను. అగ్నియందు రసతన్మాత్రమైన జలము పుట్టెను. జలమందు గంధతన్మాత్రమైన పృథివిపుట్టెను. ఇవియే సూక్ష్మభూతములు ఇవి త్రిగుణములతోఁ గూడియుండును. ఈసూక్ష్మభూతములనే తన్మాత్రలనియు అపంచీకృత భూతములనియు చెప్పుదురు. ఇదే మూల ప్రకృతియొక్క తమోగుణ కల్పన. ఈసూక్ష్మ భూతముల వల్లనే సూక్ష్మ దేహమాయెను.



## సూక్ష్మదేహవివరము.

పంచభూతగుణవిభాగము- ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, తత్వములు.

సత్వగుణం.
- అర్థాంశముకూడి—అంతఃకరణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ౫.
- అర్థాంశం వేరు— వేరు శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఆఘ్రాణము, ౫.

రాజసగుణం.
- అర్థాంశముకూడి—సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన, ౫.
- అర్థాంశం వేరువేరు—వాక్కు, పాణి, పాద, ఉపస్థ, గుదము, ౫.

దీనినే సూక్ష్మశరీరమనియు లింగశరీరమనియు జెప్పుదురు.—అంతఃకరణముజీవస్థానముగాన నదివిడిచి మిగిలిన - ౧౯ - తత్వములని కొందరందురు.

మనస్సు చిత్తముతోఁగూడి యొకటి. బుద్ధి - అహంకారముతోఁ గూడియొకటి. వెరసి - ౧౭ - తత్వములని కొంద రందురు.

మిగిలినపంచభూత తమోగుణంబె స్థూలభూతము లయ్యెను॥ యీస్థూలభూతము వల్లనే స్థూలదేహము కల్గెను.

## స్థూలదేహ వివరము.

### తమోగుణస్థూలభూత పంచీకరణము.

| పంచీకరణ భూతములు | ఆకాశాంశము | వాయ్వంశము | అగ్న్యంశము | జలాంశము | పృథివ్యంశము | తత్వములు |
|---|---|---|---|---|---|---|
| ఆకాశము | ఆకాశార్థాంశం-జ్ఞాత్వ | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | ౫ |
| వాయువు | సమాన | వాయ్వర్థాంశమువ్యాన | ఉదాన | ప్రాణ | అపాన | ౫ |
| అగ్ని | శ్రోత్రము | త్వక్కు | అగ్న్యర్థాంశమం-చక్షు | జిహ్వ | ఘ్రాణము | ౫ |
| జలము | శబ్దము | స్పర్శము | రూపము | జలార్థాంశం రసము | గంధము | ౫ |
| పృథివి | వాక్కు | పాణి | పాదము | ఉపస్థ | పృథివ్యర్థాంశముగుదము | ౫ |

వెరశి ౨౫

### పిండోత్పత్తిలక్షణము.

ఇటువలె జీవునకు స్థూల,సూక్ష్మ, కారణములని మూడుదేహములు కలిగెను. ఈదేహాభిమానముచే జీవుఁడు జన్మాదు లెత్తుచుఁ జచ్చుచు తిరుగా తల్లిగర్భంబునపుట్టుచుండును. అనినవిని శిష్యుఁడు గురురాయా? జీవుఁడుతల్లిగర్భంబున నెట్లుప్రవేశించునో తెలిపిరక్షింపుమనిన, శ్రీగురుండిట్లనియె, జీవుడు దేహాభిమానముచే కర్మంబులంజేయుచు కర్మానుభవమయిన స్వర్గనరకము లనుభవించి పునర్జన్మమునకై సూర్యకిరణముల ద్వారా మేఘంబునం జేరి వర్ష బిందువులచే సస్యములలో ప్రవేశించి అందొక్క ధాన్యబీజంబునంచేరి కర్మానుసారముగా పశు, పక్షి,మృగ, నరప్రభృతులకు లభ్యమై యదియన్నంబై యాయన్నంబు పురుషుని గర్భంబునం ప్రవేశించి రేతస్సునంజేరియా రేతస్సుచే స్త్రీగర్భంబునంజొచ్చి యందు శోణితంబునంగలసి యైదవ దినంబున నీటిబుగ్గవలెనై దశమంబున పిండాకారమయి పక్షంబున యండమయి పంచవింశతి దినంబున నంకురమయి మాసమునకు శిరం బేర్పడు. రెండుమాసములకు పాణిపాదంబును, మూడు మాసంబులకు

ఉదరాంగంబులును, నాలగుమాసములకు అంగుళి కటిప్రదేశంబులు ను, ఐదవమాసంబున రోమంబులును, ఆరుమాసంబులకు నేత్ర, కర్ణ అస్థి.బంధంబులును,ఏడుమాసంబులకు ప్రాణంబును, ఎనిమిదిమాసంబు లకు సర్వలక్షణములతో జ్ఞానంబును, నవమమాసంబున జననంబౌను అనిన, ఓస్వామి? ఈపుట్టినతత్వంబులు యెటువలె లయమౌనవిన; శి ష్యా! దేనియందు పుట్టినవో దానియందే లయించును, యెటువలె న నిన? సర్వమునకు నాధారమైన పృధివిలయించడముతోనె సర్వప్రపం చమును లయమౌను. విశేషజలమందు మంటిపెళ్లలుకఱగి ల యించినటువలె పృధివి జలమందు లయమౌను. అగ్నిచేతప్త మ యిన యినుప ముద్దయందు జలబిందువు లయించిన ట్లగ్నియం దు జలము లయమౌను, విశేషవాయువుచే దీపము ఆర్పబడినట్లు వాయువందగ్ని లయించును. ధూమము మేఘంబున లయించినట్లాకాశ మందువాయువులయించును. సుషుప్తియందు సర్వప్రపంచములయిం చునట్లుప్రకృతియందాకాశములయించును. యదార్థమయిన రజ్జుజ్ఞా నముచేసర్పభ్రమలయించి త్రాడుగాఁదోచినటువలె భ్రమమూలమ యిన ప్రకృతియదార్థమయిన బ్రహ్మసాక్షాత్కారమందులయించి బ్ర హ్మమే మిగిలియుండును. ఇందుకుదృష్టాంతము, ఇచ్ఛాప్రయత్నము లేనిసూర్యుని కిరణములచే మేఘముగల్గి యమ్మేఘమువలన వర్షోత్పత్తి యై అవ్వర్షజలమందు ప్రతిసూర్యుఁడుగల్గినట్లు బ్రహ్మమందుజీవేశ్వ రాదిప్రపంచంబుగల్గె తిరుగా తనయందుగల్గిన జలమును తనఊష్ణకిరణ ములచే గ్రహించి నపుడు తత్ప్రతిబింబమయిన సూర్యుడు తనకు కా రణమయిన సూర్యునియందు గలసి జలమును, ప్రతిబింబసూర్యుఁడును లేకముఖ్యసూర్యుఁడే మిగిలియున్నట్లు బ్రహ్మమందు గల్గినమాయ బ్ర హ్మజ్ఞానమనుకిరణములచే లయించినపుడు తత్ప్రతిబింబమయిన జీవే శ్వరులు తమకు కారణమయిన బ్రహ్మమందే ఐక్యమై ఒక్కబ్రహ్మమే మిగిలియుండును ఇందుకు ప్రమాణము. శ్రు॥ "ఏకమేవాద్వితీయ్యం బ్రహ్మ" ఇదేమహాశ్రుతియను ఇది కారణ గురుప్రులచే నెఱుఁగవల యు. ఇదియెరింగిన వారు జీవన్ముక్తులు కనుక నాత్మానాత్మ విచారము చే బ్రహ్మ జ్ఞానంబు గల్గును, అనినవిని, స్వామి? ఆత్మానాత్మవిచార

ము దెలిపిరక్షింపుమని వినయభయభక్తులచే వేడుకొనఁగా శిష్యుని యందు శ్రీగురుఁడు కరుణచే నిట్లనియె.

ఉత్పత్తిప్రకరణంసమాప్తం.

---

## ఆత్మానాత్మ ప్రకరణం.

(ఆత్మాకీదృశః) స్థూలసూక్ష్మకారణశరీరేభ్యోవ్యతిరిక్తః, పంచకోశాతీతః, అవస్థాత్రయసాక్షి చతుర్వింశతి తత్త్వాధారః, మాయయాప్రతీయమానాభ్యాం జీవేశ్వరాభ్యాంభిన్నః, సచ్చిదానందరూపస్సర్వయస్తిష్ఠతిసఆత్మా" అని చెప్పియున్నది గనుక దేహత్రయమనగా స్థూలమనియు సూక్ష్మమనియు కారణమనియు మూడువిధములు. స్థూలదేహమనఁగా మాంస, రక్త, చర్మ, శల్య, నాడీ, మజ్జయుం గూడికరచరణాద్యవయవాకారమయి శుక్లశోణిత దృష్టికిగోచరమయి యుండునది. ఇకసూక్ష్మశరీరమనఁగా జ్ఞానేంద్రియపంచక, కర్మేంద్రియ పంచక, ప్రాణాది వాయుపంచక. అంతఃకరణ చతుష్టయములంగూడినది. కారణ దేహమనఁగా ఈరెంటికి కారణమయిన యజ్ఞానాంధ కారావిద్యయే ఈమూడుదేహములు జడములౌటచే నాత్మగాదు. ఈమూడింటిని యెఱుంగుచుండు జ్ఞానమేఆత్మ. పంచ కోశములనఁగా, అన్నమయ, ప్రాణమయ, మనోమయ; విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. అందన్నమయకోశమనఁగా నన్నముచేవృద్ధిబొందుచుండు స్థూలశరీరము, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు మూడును సూక్ష్మశరీరమనఁబడును. ఆనందమయ కోశమనఁగా కారణశరీరము. దేహత్రయవ్యతిరిక్తుఁడు లేక పంచకోశవ్యతిరిక్తుఁడన్నను నొక్కటియే. కోశములనఁగా వీనెను గవిచనగప్పియున్నట్లా త్మను గప్పుకొని మఱపించి యుండునవి. అవస్థాత్రయమనఁగా, జాగ్రత్స్వప్నసుషుప్తులు. జాగ్రదవస్థయనఁగా, స్థూలదేహముచే నీజగత్తునందు సకల క్రియలుజేయునది. స్వప్నావస్థయనగా; సూక్ష్మదేహముతోఁ గూడి జాగ్రత్తయందుకన్నది, విన్నది. కోరినది, సంకల్పమాత్రమున ప్రత్యక్షముగా నిద్రయందనుభవించినట్లుండునది. సుషుప్త్యవస్థయనగానీ ప్రపంచంబేమియుదోచక శూన్యమయి అనంతముగానిద్రించుట. ఈమూఁడవస్థ

లును మాయామయమయిన యావరణ విక్షేపశక్తులవల్లగలిగెను. ఎట్లనిన, విక్షేపశక్తివలన పంచభూతములును. వాటిమేళనంబున స్థూలసూక్ష్మదేహములై వీటియవస్థ జాగ్రత్స్వప్నము లయ్యెను. ఈరెంటిని యావరించు కొనిమఱిపించియుండు నావరణశక్తియే కారణదేహమైన సుషుప్త్యవస్థయనఁబడును గనుక నీదేహములు మాయామయమనఁదగును. వీటికిసాక్షియెట్లనిన, మూడుదేహములు నొకటినొకటియెఱుఁగవుగావున వీటి నెఱుంగుచుండెడునాత్మే సాక్షియనఁబడును. "చతుర్వింశతి తత్వాధారః" అనఁగాపంచభూతములవల్ల చతుర్వింశతి తత్వములుగల్గె. ఆభూతములు ఆత్మవల్లగలిగె. ఎట్లనిన॥ శ్రు॥ "ఆత్మనాసంభూత మాకాశః" అనిచెప్పియున్నది గనుక చతుర్వింశతి తత్వములకునాత్మే యాధార మనఁబడెను. దేహములన్నను. కోశములన్నను, చతుర్వింశతి తత్వములన్ననొకటే. ఇదియె అనాత్మ. ఇదియెప్రకృతి, అనృత, జడ. దుఃఖస్వరూపమైనది, ఆత్మసచ్చిదానందమనఁబడును. ఎట్లనిన; స్థూలదేహమున నేత్రములందుండి జాగ్రత్ప్రపంచమును యెఱింగినయాత్మే స్వప్నావస్థయైన సూక్ష్మదేహముతోఁగూడి కంఠమునందుండి స్వప్నావస్థ నెఱుఁగునపుడు స్థూలదేహమును, తదవస్థయు, స్వప్నమందు లేకపోయెనుగనుక స్థూలదేహము అనృతమనఁబడెను. సూక్ష్మదేహమందుండి స్వప్నావస్థనెఱుంగు నాత్మే సుషుప్తి యనవస్థయైన కారణదేహముతోఁ గూడి హృదయమందు నిలచి సుషుప్తియవస్థయైన శూన్యమును యెఱుఁగునపుడు సూక్ష్మదేహమును, తదవస్థయు, సుషుప్తియందు లేకపోయెనుగనుక సూక్ష్మదేహమనృత మనఁబడెను. సుషుప్త్యవస్థయైన కారణదేహము, తదవస్థయు, సమాధియందు లేకపోయెను గనుక కారణదేహ మనృతమనఁబడెను. ఇటువలె దేహత్రయములును అనృతమనఁబడెను. ఈదేహాదులొకప్పుడుండి యొకప్పుడు లేకపోయినా ఆత్మయనుస్రుతమై యుప్పటికి యుండుటచే ఆత్మసద్రూపమనఁబడెను. చిద్రూపమనఁగా; దేహత్రయములు. కుడ్యాదులవలె జ్ఞానములేక జడములైయుండును. ఎటువలెననిన, మరణమూర్ఛాకాలములం దాత్మలేకపోవుటచే దేహముండియు జ్ఞానములేకపోయెగనుక దేహత్రయములున్ను జడములనఁబడును.

ఆత్మయీజడమయిన దేహాదులను జ్ఞానముగా బ్రవర్తింపజేయుచు దేహకార్యములైన జాగ్రత్స్వప్న సుషుప్తులందుండి తదవస్థల నెఱుంగుచుండుటచే ఆత్మ చిద్రూప మనఁబడెను. ఆనందమనఁగా; దేహము హేయమై రోగములు గలదియై సంసార సంభవమై చింతకు మూలమై కామక్రోధాదులకు నిలయమై జరామరణాద్యవస్థలు గలఁదియై యుండుటచే దేహము దుఃఖ మనఁబడును. ఆత్మజన్మమరణాదులు లేనిదియు, దుఃఖమునకు మూలమై దేహము లేనిదియు॥ శ్రు॥ " సయోహ వై తదచ్ఛాయ మశరీరములోహితం" ఛాయయు, శరీరము, వర్ణములు లేనిదియు, సుఖమైన సుషుప్తికి మించిన సుఖమైనదియు, ఇతరసుఖముల నపేక్షించకుండునదియు, ఆనందమే స్వరూపమైనదియు, శ్రు॥ "ఆనందో బ్రహ్మ" అని శ్రుతులు బలుకుచున్నవి గనుక నానందమే ఆత్మగావున అనాత్మయైన యీదేహము నేనుగాను, ఈ దేహమునకు విలక్షణమైన సచ్చిదానందమైన ఆత్మయే తానని యెవ్వరెఱుంగుచున్నారో వారే జీవన్ముక్తులు. ఇదియె సాంఖ్యము. శ్లో॥"అస్తిభాతిప్రియంరూపం నామచేత్యంశ పంచకం। అద్యత్రయం బ్రహ్మరూపంజగద్రూపం తతోద్వయం" (అస్తి) యనఁగాఉన్నది. (భాతి)యనఁగాప్రకాశించుచున్నది (ప్రియ) మనఁగా నానందం. ఇదియే ఆత్మయనబడును (నామ, రూపం) ఇవిరెండును జగద్రూపములు. ఇదే అనాత్మ. ఈ ఐదంశములును అన్నిటియందుఁగలఁదు. (అస్తి, భాతి, ప్రియం)అనఁగా సత్తు, చిత్తు, ఆనందమని చెప్పఁబడును. యీమూడును బ్రహ్మలక్షణము లనఁబడును. ఇదియే ఆత్మ, ఇట్టియాత్మే నీవు గనుక నీవే సచ్చిదానంద బ్రహ్మము. అనినవిని శిష్యుఁడు ఆనందభరితుండై, ఓదీనదయానిధే! అనాత్మయయిన జడదేహము నేనుగాను. దీనికిసాక్షియైనఆత్మ నేనని తెలియవచ్చెను. నేనేబ్రహ్మమంటివే, నేనెటువలె బ్రహ్మమయ్యెద, వ్యష్టియందుండు నేను సర్వపరిపూర్ణ బ్రహ్మ మెటువలెనాదుననిన; శ్రీగురుండించుక నవ్వుచు నిందుకు బ్రహ్మోపదేశమే జేయవలయునని తలంచెను.

ఆత్మానాత్మ ప్రకరణం సమాప్తం.



## బ్రహ్మోపదేశ ప్రకరణము.

ఓయి శిష్యోత్తమా! యింక నిష్కర్షగా పరతత్వ నిర్ణయంబెఱిగించెదము, నీవు మాయందే దృష్టియుంచి బుద్ధిచే మేము జెప్పఁబోవు నర్థమును గ్రహించెదవేని మనన నిష్కర్షగలిఁగి యుండుము ఎట్లన, ఈబ్రహ్మవిచారణ చేయుటకు సాధనచతుష్టయ సంపత్తిగలవాఁడె యధికారియని అనుబంధ చతుష్టయములో జెప్పియున్నది. అనుబంధ చతుష్టయమనఁగా నధికారియనియు విషయమనియు సంబంధమనియు, ప్రయోజనమనియు,నాలుగువిధములుఁగా వేదాంతములందు జెప్పియున్నది. ఇందులో నధికారియనఁగా: సాధనచతుష్టయ సంపత్తి గలవాఁడే. ఇందుకు ప్రమాణము. సూత్రం॥ "సాధన చతుష్టయ సంపత్యానంతరం అతః సంపూర్ణాధి కారిత్వాత్, అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనఁగా సాధనచతుష్టయసంపత్తిగలిఁగిన తరువాత బ్రహ్మవిచారణచేయుటకు నధికారియని వేదాంతప్రమాణము గనుక ముందుగా సాధన చతుష్టయము గలిఁగియుండవలయు. సాధన చతుష్టయ మనఁగానిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి, ముముక్షుత్వమని నాలుగు సాధనలు. నిత్యానిత్యవస్తు వివేకమనఁగా; బ్రహ్మము నిత్యము. బ్రహ్మముకన్న నన్యమైన జగదాది సర్వమును అనిత్యమని యెఱుంగుటయె. ఇంక ఇహాముత్రార్థ ఫలభోగవిరాగ మనఁగా, నీలోకంబున పత్ని, పుత్రా, న్న; పానాది, భోగములందును, పరమందు స్వర్గాది బ్రహ్మలోకములందును, ఆశలేకయుండుట, అనిన స్వామీ స్వర్గాదిభోగములకై అనేకులు ప్రయత్నము జేయుచున్నారె యనఁగా; శిష్యా, వారు వ్యర్థులు, వారికిజన్మాదులు గలవని ప్రమాణముఁగలదు. శ్రు॥ "యోవాఏతదక్షరమవిదిత్వాత్, అస్మాల్లోకా త్ప్రైతి సకృపణః" అనఁగా నాత్మజ్ఞానము లేక నాస్వర్గాదులకు వెళ్లినను వాఁడు వ్యర్థుడనియు, "క్షీణేపుణ్యేమర్త్యలోకేవిశంతి" అనఁగా పుణ్యము క్షీణించిన తోడనే జన్మాదులకు వచ్చునని వేదమందు చెప్పి యున్నది. ఇదియునుంగాక స్వర్గాధిపతియయిన ఇంద్రుడు గురుపత్నీ సంగమముచే దేహమంతయును యోనులౌనట్లు గురువుచే శాపముబొంది యనేక దుఃఖ

ములు బొందినట్లు శాస్త్రములందు జెప్పియున్నది గనుక నీలోకమువ లెనే స్వర్గాదులందును దుఃఖమేగలిగి యున్నది కావున స్వర్గాదిప్రయత్నము చేయంగూడదు. ఇదియె ఇహాముత్రార్థఫల భోగ విరాగము. శమాదిషట్క సంపత్తియనఁగా; శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధి, యని యారువిధములు. శమమనఁగా బాహ్యేంద్రియ నిగ్రహము, దమమనఁగా అంతరింద్రియ నిగ్రహము. ఉపరతియనఁగా సత్కర్మానుష్ఠానములు బ్రహ్మార్పణ బుద్ధ్యా జేయుచు వైరాగ్యము గల్గియుండుట. తితీక్షయనఁగా సుఖ దుఃఖ మానావమానముల కోర్చియుండుట. శ్రద్ధయనఁగా నితరవిషయాదులం దాశవిడిచి గురువేదాంత శ్రవణాశక్తి గలిఁగియుండుట. సమాధియనఁగా గురువుల వల్ల విన్నయర్థమును మఱువక బుద్ధిని యాయర్థాను సారముగా నిలిపి బాహ్యప్రపంచమును మఱచియుండుట. ఇక ముముక్షుత్వమనఁగా మోక్షమందే యిచ్ఛగలిఁగి యుండుట. అదెట్లనిన; ఇల్లుచుట్టును గాలుచుండఁగా నాయింటనుండు పురుషుఁడు తప్పించుకొని పోవలెనని యెటువలె పరితపించునో అటువలె నీసంసార తాపత్రయములచే దహించుచుండు నన్నెవరు రక్షించెదరోయని యార్తిచే సద్గురువులంజేరి భక్తి, శుశ్రూషలు శేయుచు తాపత్రయ నివారకంబైన వారి పాదపద్మములంబడి వారికరుణచే వేదాంత శ్రవణంబుజేయుచు సర్వకాలము మోక్షమం దిచ్ఛ గలిగియుండుట. ఈనాలుగు సాధనలు గలవాఁడే బ్రహ్మవిచారణ కధికారి. విషయమనఁగా నాలుగు మహావాక్యముల ద్వారా జీవ బ్రహ్మైక్యమును ప్రతిపాదించుట. సంబంధమనఁగా నితర సంబంధముల విడచి తనకు బ్రహ్మముతో సంబంధము దెలియుట. ప్రయోజనమనఁగా నితర ప్రయోజనములు విడచిసార్వకాల మపరోక్షజ్ఞానమందే యుండుట. ఈనాలుగు ననుబంధచతుష్టయము లనఁబడును, అని విని శ్రీగురురాయా ? అధికారియను పదమున కర్థము స్పష్టముగా జెప్పినట్లు తక్కిన మూడు పదములకును అర్థముజెప్పి రక్షింపవలెననిన; శిష్యునియందు కరుణచే వత్సా, విషయమనఁగా జీవ బ్రహ్మైక్యము. ఇది నాలు మహావాక్యములద్వారా తెలియవలెను. అదియెటువలెనంటే॥ "ప్రజ్ఞానంబ్రహ్మ,

అహంబ్రహ్మాస్మి, తత్వమసి, అయమాత్మాబ్రహ్మ" అని నాలుగుమహావాక్యములు. ఈవాక్యము లెందులోఁగలవంటే ॥"ప్రజ్ఞానంబ్రహ్మ" మను మహావాక్యము ఋగ్వేద జ్ఞానకాండమందు ఐతరేయోపనిషత్తులో లక్షణవాక్యము. "అహంబ్రహ్మాస్మి" యను మహావాక్యము యజుర్వేద జ్ఞానకాండమందు తైత్తిరీయోపనిషత్తులో శిష్యవాక్యము. "తత్వమసి" యను మహావాక్యము సామవేద జ్ఞానకాండ ఛాందోగ్యోపనిషత్తులో గురువాక్యము, "అయమాత్మా బ్రహ్మ" యనుమహావాక్యము అథర్వణవేద జ్ఞానకాండమందు ముండకోపనిషత్తులో సాక్షాత్కార వాక్యము ఈనాలుగు మహావాక్యములద్వారాఁ జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించును. నిశ్చలచిత్తుండవై వినుమని యిట్లనియె. మొదటిలక్షణ వాక్యమునకు అర్థము. ప్రజ్ఞానమనియు, బ్రహ్మమనియు, రెండుపదములు. పదములకు లక్ష్యార్థమని, వాచ్యార్థమనియు, రెండుగలవు లక్ష్యార్థమనఁగా పట్టునది. వాచ్యార్థమనఁగా విడుచునది. ప్రజ్ఞానమునకు నిర్వచనము. శ్లో॥ ఏనేక్షతేశృణోతీదం జిఘ్రతివ్యాకరోతిచ । స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం" ఇందుకు అర్థము. ప్రజ్ఞానమనఁగా నీశరీరమందుండేజీవుఁడను జ్ఞానమంతఃకరణముతోఁగూడి శ్రోత్రద్వారా ఇది పలానిశబ్ద మిది పలానిశబ్దమని యెఱుంగుచున్నాఁడో అజ్ఞాన మంతఃకరణముతోఁగూడి చర్మమున సోకిన స్పర్శ నెఱుంగుచున్నాఁడు, అజ్ఞాన మంతః కరణముతోఁగూడి నేత్రములచే సర్వరూపములను నెఱుగుచున్నాఁడు అజ్ఞాన మంతః కరణముతోఁగూడి జిహ్వాచే షడ్రసముల నెఱుఁగుచున్నాఁడు. అజ్ఞాన మంతఃకరణములతోఁగూడి నాసికముచే సుగంధ దుర్గంధముల నెఱుఁగుచున్నాఁడు. జ్ఞానమె వాక్కుచే మాట్లాడించుచు నిటువలెనె సర్వేంద్రియముల ద్వారా సర్వవిషయముల నెఱుఁగుచున్నాఁడు. అజ్ఞానమె ప్రజ్ఞానము. ఈజ్ఞానమె ప్రజ్ఞానమను పదమునకు లక్ష్యార్థము. అంతః కరణము, దానివృత్తులు, ఇంద్రియాదులు, జడములౌటచే వాచ్యార్థము, యిక బ్రహ్మమను పదమున కర్థము. శ్లో॥ "చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యా శ్వగవాదిషు । చైతన్యమేకంబ్రహ్మాం తత్ ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి" బ్రహ్మాది పిపీలి కాంత

మైనసర్వశరీరములు వాచ్యార్థములు. ఇంక లక్ష్యార్థమెట్లనిన; యేజ్ఞానము బ్రహ్మేంద్ర గవాశ్వపిపీలికాది సకల శరీరములయందు నేకమై యున్నదో, ఆజ్ఞానమే బ్రహ్మమునకు లక్ష్యార్థము గనుక ప్రజ్ఞానమే బ్రహ్మము. ఇంక అహం బ్రహ్మాస్మియను మహావాక్యమున కర్థము, ఈవాక్యమునకు అహం, బ్రహ్మ, అస్మి, యనిమూడు పదములు. ఇందులోఅహమను పదమునకర్థము. శ్లో॥ "పరిపూర్ణ పరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిని। బుద్ధిసాక్షితయాస్థిత్వా స్ఫురన్నహామి తీర్యతే" ఇందుకర్థము. అహమనంగా దేహేంద్రియ ప్రాణ మనోహంకారము లుజడములై యనిత్యములైనవి గనుక అహమనంబడవు గావున అహం పదమునకివి వాచ్యార్థములు సర్వత్రపరిపూర్ణమైన పరమాత్మ శరీర మునందుండి బుద్ధికిసాక్షిగానుండి ప్రకాశించు ప్రత్యగాత్మ లక్ష్యార్థము ఇంక బ్రహ్మపదమున కర్థము. శ్లో॥ "స్వతః పూర్ణపరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః" ఇందు కర్థము. బ్రహ్మపదమునకు బ్రహ్మాండమంతయు వాచ్యార్థము. బ్రహ్మాండమున కంతర్బాహ్యము లందును తనకు తానేపూర్ణమయిన పరమాత్మే బ్రహ్మశబ్దముచేత వర్ణింపబడ్డది యయి ప్రకాశించుచుండుం గావున నదియేబ్రహ్మమునకు లక్ష్యార్థము.ఇంకఅస్మియనగా॥ శ్లో॥"అస్మిత్యైక్య పరామర్శాత్తేన బ్రహ్మభవా మ్యహాం" ఇందుకర్థము. అహంపదవాచ్యార్థమును - బ్రహ్మపదవాచ్యార్థ మును తోసివేసి యారెంటిలక్ష్యార్థముల కైక్యంబు దెలియునదియె అస్మిపదమునకు లక్ష్యార్థము అనంగాప్రత్యగాత్మ స్వరూపుడైన తనకును ఆ పరిపూర్ణ బ్రహ్మమునకును ఐక్యముదెలిసి నేను బ్రహ్మమయితినని తెలియుటయె యీవాక్యమున కర్థము. ఇంకతత్వమసియను మహావాక్యమునకర్థము. తత్పదమనియు, త్వంపదమనియు, అసిపదమనియు మూడుపదములు. తత్పదమునకర్థము. శ్లో॥ "ఏకమేవా ద్వితీయ్యం సన్నామరూప వివర్జితం। సృష్టేః పురాతనాదస్య తాదృక్త్వం తదితీర్యతే" ఇందు కర్థము. సమష్టి శరీరత్రయ అవస్థాత్రయాభి మానవిరాడ్ హిరణ్యగర్భ అవ్యాకృతనామ సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యా మిత్వాదిగుణంబులం గూడిన మాయా ప్రతిబింబేశ్వరుండె తత్పదమునకు వాచ్యార్థము. సృష్టికి పూర్వము దేకమై నామరూప

రహితమై పరమాత్మమయిన బ్రహ్మమే తత్పదమునకు లక్ష్యార్థము. ఇంకత్వంపదార్థ మెట్లనిన॥ శ్లో॥ శ్రోతు ర్దేహేంద్రియాతీతం । వస్త్వత్ర త్వంపదోదితం॥ ఇందుకర్థము; శిష్యా, నీయొక్క స్థూల సూక్ష్మ కారణ శరీరములును జాగ్రత్స్వప్న సుషుప్త్య ద్యవస్థాత్రయములును, విశ్వతైజస ప్రాజ్ఞ నామాభి మానములును కించజ్ఞత్వ కర్తృత్వ, భోక్తృత్వ గుణంబులంగూడిన యవిద్యాప్రతిబింబ జీవుఁడే త్వంపదమునకు వాచ్యార్థము. ఇఁక లక్ష్యార్థమెట్లనిన; శిష్యానీయొక్క దేహత్రయ విలక్షణమయి, అవస్థాత్రయ సాక్షియై, పంచకోశ వ్యతిరిక్తమై, సచ్చిదానంద రూపకూటస్థ చైతన్యంబైన ప్రత్యగాత్మ, లక్ష్యార్థము. ఇఁక నసిపదార్థం బెట్లనిన॥ శ్లో॥ "ఏకతాగ్రాహ్యతే సీతి తదైక్యమనుభూయతాం"అనఁగా తత్పద త్వంపద వాచ్యార్థంబైన జీవేశ్వరులేవాచ్యార్థము. ఇందుకు లక్ష్యార్థం బెట్లనిన; నీరెంటి లక్ష్యార్థములైన ప్రత్యగాత్మ పారమాత్మైకంబై అసిపదమునకు లక్ష్యార్థమవును. అని విని శిష్యుడు స్వామి; ద్వివిధలక్షార్థములు వేరువేరుగానుండియు ఐక్యం బెట్లగుననిన: వినవోయీ, జీవుఁడనఁగా వ్యష్టిదేహత్రయాభిమాని, ఈశ్వరుఁడనఁగా సమష్టి దేహత్రయాభిమాని. వ్యష్టియనఁగా యొక్కటి. సమష్టియనఁగా ననేకము. ఎట్లనిన ననేకవృక్షంబులు గూడినవనముసమష్టి. అందైకైకవృక్షంబు వ్యష్టి, సమష్టియం వ్యష్టియంత భూతమాయెగనుక ఈశ్వరునికి సకలజీవులంగూడి ఈశ్వరుడనఁబడు. కాబట్టి జీవేశ్వరులకైక్యము స్వభావమేకదా, ఇంకొక పక్షము ఘటజల ప్రతి బింబాకాశమునకు ఘటజలాకాశ మనియు, పటజల ప్రతిబింబాకాశమునకు ఘటజలాకాశమనియు రెండుపేళ్లు గలిగియుండినను ఘటజల తటజలా ద్యుపాధులనుత్రోయఁగా నొక్కయాకాశమం దైక్యమెట్లగునో అటువలెనే యెరుంగునది. ఇందుకుదాహరణము. "మాయయా ప్రతియ్యమాభ్యాం జీవేశ్వరాభ్యాం భిన్నః సచ్చిదానంద రూపస్స్వయం స్తిష్టతి స ఆత్మా" అనియున్నది గనుక సచ్చిదానంద బ్రహ్మమే మాయా విద్యలయందు ప్రతిబింబించినందువలన జీవుఁడనియు, ఈశ్వరుఁడనియు. నుపాధి భేదములచేత పర్యాయనామములు గలిగెను. ఘటజల తటజలా ద్యుపాధు

లను. తోసివేసినపిమ్మట తదుభయ ప్రతిబింబాకాశములకు ముఖ్యాకాశమం దైక్యమయినట్లు విద్యామాయలను తోసివేసినపిదప జీవేశ్వరులులేక బ్రహ్మమందైక్యమౌనని దెలియుట యసిపదమున కర్థము అనఁగా నుభయవాచ్యార్థముల నిషేధించి వుభయలక్ష్యార్థముల కైక్యంబు దెలియునదియె ప్రతిబింబయిక్యంబయిన యసి పదార్థంబు. ఇది ఐక్య నిష్కర్ష. ఇంక ననుభవంబయిన శుద్ధ జీవబ్రహ్మైక్యంబు నెరింగించెద. బ్రహ్మమనఁగా తత్పదార్థ లక్ష్యార్థమయిన పరమాత్మ బ్రహ్మమనంబడు. జీవుఁడనగా, త్వంపద లక్ష్యార్థ భూతుండైన ప్రత్యగాత్మయనఁబడు. ఇదియే నీవు. నిన్నునీవెఱింగితివేనిఁ బ్రహ్మమయ్యె పరిణమించును, ఎట్లనిన ఘటాకాశమనియు మహాకాశమనియు చెప్పఁబడును, ఘటముపోయిన నారెండు పేళ్లుపోయి యాకాశమన్నట్లు అంతఃకరణ ముండువరకు ప్రత్యగాత్మ యనియు పరమాత్మయనియు నామము. అంతఃకరణము మిథ్య గనుక నదినశించిన వెనుక బ్రహ్మమేయనంబడును, ప్రత్యగాత్మ పరమాత్మయను నామములు లేక పోవును. ఇందుకుదృష్టాంతము॥ శ్లో॥ ఘటేనష్టే యథావ్యోమ. వ్యోమైవ భవతిస్వయం. తథైవోపాధివిలయే। బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం॥ ఘటము నశించిన నాయాకాశమునకే ఘటాకాశ మహాకాశమనే నామముపోయి ఆకాశమన్న ట్లుపాధి నశించిన ప్రత్యగాత్మ పరమాత్మయను నామముపోయి బ్రహ్మమయ్యేయుండును. ఉపాధియుండినను దానికిసాక్షియవుటచే ప్రత్యగాత్మయనఁబడు. ఇదిసవికల్పకము ఉపాధిమిథ్యగనుక నుపాధివిలయమందుసర్వము బ్రహ్మమయ్యేయుండును. ఇదినిర్వికల్పకము. ఇదియేబ్రహ్మనిష్ఠ అనివిని శిష్యుఁడు స్వామీ? శుద్ధజీవుఁ డంటివే ఇంకొక జీవుఁడున్నట్లు సందేహాము తోచుచున్నదనిన; శిష్యా? మంచిశంకచేసితివి, జీవుఁడనఁగా రెండువిధములు, శుద్ధజీవుఁడని, శబలజీవుఁడనియు శుద్ధజీవునే ప్రత్యగాత్మ యందురు. భగవద్గీతలయందు॥ "క్షేత్రజ్ఞమాం" అని భగవాన్ జీవుడు నేనని చెప్పియున్నాఁడు గనుక నీజీవుఁడు శుద్ధజీవుఁడైన ప్రత్యగాత్మ యనఁబడును. గనుక నాచార్యస్వాములు॥ "జీవోనాహం"॥ అనిచెప్పియున్నారు గనుక నిదిశబలజీవుఁడు. ఇతఁడే బ్రతిబింబజీవుఁడు. ఇతఁడే పంచవింశ

కుండుగనుక శుద్ధజీవుండైన ప్రత్యగాత్మే బ్రహ్మము ఇందుకులక్షణం బెట్లనిన; జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ, యనిమూడువిధములు. ఇందుకుదాహరణము, "గంగాయాం ఘోషః" ఇదిజహల్లక్షణ, అనఁగా విడుచులక్షణ. "మంచాః క్రోశంతి" ఇదివిడువనిలక్షణ, "సోయం దేవదత్తః" ఇదివిడిచివిడువనిలక్షణ. ఎట్లనిన॥ సః, అనఁగాతత్కాల తద్దేశవిశిష్టుఁడైన దేవదత్తునింజెందు అయం అనఁగా నేతద్దేశ ఏతత్కాలవిశిష్యుడైన దేవత్తునింజెందు. తత్కాల, తద్దేశ, ఏతత్కాల, ఏతద్దేశాదులను విడిచి తద్దేవదత్తుఁడే ఏతద్దేవదత్తుఁడని ఏక పిండమందు లక్షించి వాఁడే వీఁడని యెఱింగినట్లు తత్పద, వాచ్యార్థములను త్రోసివేసి తత్పద లక్ష్యార్థ పరమాత్మయైన బ్రహ్మంబె త్వంపద లక్ష్యార్థ ప్రత్యగాత్మయనియు, త్వంపద లక్ష్యార్థుండైన ప్రత్యగాత్మే తత్పద లక్ష్యార్థ పరమాత్మయైన బ్రహ్మంబనియు నీయుభయ లక్ష్యార్థములకైక్యంబు దెలియు నిదియేఅసిపదమునకు లక్ష్యార్థము. శ్రు॥ "తత్వమసిత్వం తదసి" అనియున్నది గనుక నీవే బ్రహ్మము, బ్రహ్మమే నీవు. శ్లో॥ "కూటస్థో బ్రహ్మజీవేశా విత్యేవంచ చతుర్విధాః ఘటాకాశో మహాకాశో జలాకాశా భ్రకేయథా" అనగా నొక్కనికే కూటస్థుఁడని బ్రహ్మమని, జీవుఁడని, ఈశ్వరుఁడనియును, నాలుగు, విధములగు నామములు గల్గెను, కూటస్థుఁడనిన, శుద్ధజీవుఁడనిన, సాక్షియనిన, నొక్క ప్రత్య గాత్మునికే యర్థము. రెండవది, బ్రహ్మమనిన, పరమాత్మయనిన, నొక్కటె మూఁడవది, శబలజీవుఁడనిన, దేహాభిమాయనిన, పంచవింశతుఁడనిన, అవిద్యాప్రతిబింబుఁడనిన, నొక్కజీవునికే యర్థము. నాలుగవది. ఈశ్వరుఁడనిన, సమష్టి దేహాభిమాని యనిన, మాయా ప్రతిబింబ మనిన, నొక్కఈశ్వరునికే యర్థము. ప్రతిబింబైక్యమనఁగా; శబలజీవైక్యము ఘటావచ్ఛినాకాశైక్యమనఁగా; ప్రత్యగాత్మైక్యము, ఈ తత్వములు, విభజనగాఁ దెలిపెదము॥ ఇరువదినాలగవ తత్వమగు నంతఃకరణము ఘటజలమువంటిది॥ ఇరువదియైదవ తత్వమగు జీవుఁడు ఘటజల ప్రతిబింబాకాశము వంటివాఁడు. ఇరువదియారవ తత్వమగు మాయ తటజలమువంటిది. ఇరువది యేడవతత్వమగు నీశ్వరుఁడు తటజల ప్రతిబిం

బాకాశము వంటివాఁడు ఇరువదియెనిమిదవ తత్త్వమగు శుద్ధజీవుఁడైన
ప్రత్యగాత్మ ఘటాకాశము వంటివాఁడు. ఇరువది తొమ్మిదవ తత్త్వమగు
పరమాత్మ మహాకాశమువంటిది. ఇరువైయెనిమిదవ తత్త్వమగు ప్రత్య
గాత్మయును, ఇరువైతొమ్మిదవ తత్త్వమగు పరమాత్మయును, నొక్క
టియుండియు నుపాధివలన నామభేదముగలైను గనుక నుపాధిని విడి
చేసేని జ్ఞానే ముప్పదవతత్త్వమగు బ్రహ్మమనిపించుకొనును. ప్రత్యగా
త్మయైన సాక్షికి త్రివిధ తాదాత్మ్యముకద్దు. అదియెట్లనిన॥ శ్లో॥ "అ
హంకారస్య తాదాత్మ్యంచిచ్ఛాయా దేహసాక్షిభిః। సహజంకర్మజం
భ్రాంతి జన్యంచ త్రివిధంక్రమాత్." అనఁగామాయాధిష్ఠాన చైతన్య
మునకు సాక్షియైన ప్రత్యగాత్మయను నామముగలైను, అంతఃకరణ
ము ప్రతి బింబమైన నాప్రత్యగాత్మకే చిదాభాసుఁడైన జీవుఁడనునా
మముగలైను. ఆచిదాభాసునకే దేహమందు బింబించుటచేత దేహమే
జ్ఞానమనియు నదియే నేనను కర్తజన్య తాదాత్మ్యమాయెను, ఈ
మూఁడునామములు నుపాధిభేదము వలన గలిగెను గనుక లక్ష్యార్థమై
న బ్రహ్మమే సత్యము. ఇఁక అయమాత్మా బ్రహ్మయను మహావాక్యము
నకర్థము. ఈవాక్యమునకును అయమనియు, ఆత్మయనియు, బ్రహ్మమ
నియు, మూఁడు పదములు గలవు. అయమను పదమున కర్థము॥ శ్లో॥
"స్వప్రకాశా పరోక్షత్వా దయమిత్యుక్తితోమతం" ఇందు కర్థము,
స్వప్రకాశమై, అపరోక్షమయిన చైతన్యమే అయమనుపదము
నకర్థము. ఇఁక నాత్మయనఁగా॥ శ్లో॥ "అహంకారాది దేహాంతం ప్ర
త్యగాత్మేతిగీయతే" అర్థము. అహంకారము మొదలుకొని దేహేంద్రి
యాది పర్యంతము జడముగనుక వీనినెఱుఁగుచుండు ప్రత్యగాత్మ ఆత్మ
యను పదమున కర్థము. ఇఁక బ్రహ్మమనఁగా॥ శ్లో॥ "దృశ్యమానస్య
సర్వస్య జగతస్తత్త్వమీర్యతే॥" అర్థము. ఈసమస్తమైన దృశ్య పదా
ర్థమంతయు ననిత్యమని బ్రహ్మాండమంతయును కడఁద్రోయఁగా మిగిలి
నస్వప్రకాశ పరిపూర్ణమే బ్రహ్మపదమున కర్థము. ఇంకొక్క పక్ష
ము. అయం, ఆత్మ, బ్రహ్మ. అయమనఁగా అపరోక్షమైన యీయా
త్మ; ప్రత్యగాత్మే బ్రహ్మము, పరిపూర్ణ బ్రహ్మమనియర్థము, ఇదియే
అనుబంధ·చతుష్టయములో విషయ మనే శబ్దమున కర్థము. సంబం

ధ మనఁగా నితర సంబంధముల విడిచి యీజీవ బ్రహ్మైక్యమును సర్వకాలములందును ప్రతిపాదించుటయే సంబంధము. ప్రయోజనమనఁగా నితర ప్రయోజనముల విడిచి యీనాలగు మహావాక్యముల ద్వారా నీవే బ్రహ్మము, బ్రహ్మమె నీవని ప్రతిపాదించు చున్నది గనుక అద్వితీయ్య సచ్చిదానందమైన బ్రహ్మమే తానని తెలియుచుండుటయే ప్రయోజనము. శిష్యా? నీవు జీవుడవుగావు, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణములు నీకు లేవు. నీవఖండాద్వితీయ్య పరిపూర్ణ బ్రహ్మం బని బోధించి హస్తమస్తక సంయోగ దీక్షచే బ్రహ్మోపదేశము జేసిన శిష్యుండానంద భరితుండై నామరూపాదులను "నేతినేతి" యను మహావాక్యముచే దేహేంద్రియాది సర్వ ప్రపంచమును కడత్రోయంగా మిగిలిన తానే బ్రహ్మంబై తానన్నది లేక మఱచి కొంత దడవు బ్రహ్మానంద మగ్నుండై కన్నులు తెఱచి చూచి లేచి ప్రదక్షిణముచేసి పునఃపునః ప్రణామంబు లాచరించి హే దీనదయానిధే? మీ కరుణచే భవవార్ధి దాఁటి బ్రహ్మానందుండనయి మృత్యుంజయుఁడ నైతిననిన; గురుండు శిష్యునియందు కరుణచే శిష్యా? యిప్పటికి అపరోక్షమును పొందియుండుమాయనివ; స్వామి అపరోక్షమనగా నెట్టిదనిన; వత్సా? పరోక్ష మనఁగా తనకంటె ఆత్మ వేరని జప, తప, యజ్ఞ, యాగాది, దేవతాపూజ మొదలైనవి చేయుట. ఇఁక నపరోక్షమనఁగా; "యథాదేవోహం, పురుషోహం, స్త్ర్యహమితి దృఢనిశ్చయ జ్ఞానం తిష్ఠతి తథా నిజస్వరూపేపి సత్యజ్ఞానానందోహమేవేతి దృఢనిశ్చయ జ్ఞానం యదస్థిత దేవాపరోక్షజ్ఞానం" అనఁగా దేవుఁడనునేను, పురుషుఁడనునేను, స్త్రీని నేనని స్త్రీపురుష దేవతాశరీరములను వాచ్యార్థములనికడద్రోఁచి తల్లక్ష్యార్థమైన సత్య జ్ఞానానంద బ్రహ్మమే తానని దృఢమైయుండుట యేదిగలదో అది యపరోక్షజ్ఞానము. శ్రు॥ "అపరోక్ష జ్ఞానవాన్ జీవన్ముక్తః" అని చెప్పియున్నది గనుక నీనిష్ఠ నీకుసహజమయ్యేయున్నది॥ శ్లో॥ స్వాత్మమంత్రం సదాపశ్యే త్స్వాత్మజ్ఞానం సదాభ్యసేత్ స్వాత్మజ్ఞానం సుఖం భుక్తే రిత్యేవం మంత్రిముత్తమం॥ అహంబ్రహ్మాస్మి మంత్రోయం జన్మపాపం వినాశయేత్, అహంబ్రహ్మాస్మి మంత్రోయం ద్వైతదుః

ఖం వినాశయేత్, అహంబ్రహ్మాస్మి మంత్రోయంకోటిదోషం వినాశయేత్, అహంబ్రహ్మాస్మి మంత్రోయంద్వైతంసర్వం వినాశయేత్. సర్వవ్యాపార ముత్సృజ్య అహంబ్రహ్మేతిభావయ, అహంబ్రహ్మేతి నిశ్చిత్య త్వహంభావం పరిత్యజ, సర్వమంత్రాన్ పరిత్యజ్య ఏతన్మంత్రం సమభ్యసేత్. సద్యోమోక్ష మవాప్నోతి నాస్తి సందేహమణ్వపి, సత్యంసత్యం పునఃసత్యం బ్రహ్మణోన్యం నకించన॥

ఇతి బ్రహ్మోపదేశ ప్రకరణం సమాప్తం.

## స్వరూప ప్రకరణం.

శ్రు॥ "సర్వం తత్స్వరూపమేవపశ్యన్ జీవన్ముక్తి మవాప్య ప్రారబ్ధ ప్రతిభాసనాశ పర్యంతం స్వస్వరూపాను సంధానేన వసేత్" వత్సా అపరోక్షజ్ఞానముచే నంతటను తాననిజూచుచు జీవన్ముక్తినిపొంది ప్రారబ్ధమైన దేహముయొక్క నాశపర్యంతము స్వరూపాను సంధానముచే నుండవలెను. అనినవిని శిష్యుండు హే పరమగురో? ప్రారబ్ధమనంగా నెట్టిదో తెలుపవలయు ననిన॥ శ్లో॥ "ప్రారబ్ధం భోగతోనశ్యేత్ తత్వజ్ఞానేన సంచితం ఆగామిద్వివిధంప్రోక్తం తద్వేషి ప్రియవాదినోః" అనంగా ప్రారబ్ధం సంచితం ఆగామియని మూడువిధములు. ఇందుకు ప్రారబ్ధ మెట్టివారి కనుభవింపక తీరదు. ఎందువల్ల ననిన; జ్ఞానోపదేశమునకు ముందు విధింపబడినది గనుక ననుభవింపకతీరదు ఐనను జ్ఞానికెటువలె భోగసిద్ధి యగుననిన; మిథ్యాస్వప్నంబునం దోచిన వనితాది భోగవిషయంబులకు సత్యత్వంబు గలిగినదైనను ఎటువలెమిథ్యలైయుండునో అటువలెను, వేరునరికిన చెట్టు; తొడనేయెండిపోవక క్రమక్రమముగా నెండినటువలెనున్ను దగ్ధపటమువలెనుండి ప్రారబ్ధ మనుభవించుచున్నానను యభిమానములేక జ్ఞానికి ప్రారబ్ధ దేహముండియు మిథ్యయై క్రమక్రమముగా నశించిపోవును. ఇంకసంచితమనంగానాదికర్మ. ఇదిదేహోత్పత్తికి బీజమువంటిదని శాస్త్రములందు జెప్పినను బ్రహ్మాగ్నిచే తప్తంబైన సంచితకర్మంబు జన్మాదులకు కారణము కానేరదు ఎట్లనిన; వేయించిన శనగలు మొదలైనవి భుజించుటకు మాత్రంబె యోగ్యంబై యంకురోత్పత్తికి కారణంబు కానేరనియట్లు

బ్రహ్మాగ్నిచే దహింపఁబడిన సంచితకర్మం బీజన్మముతోనే తీరుఁగాని పునర్జన్మమునకు హేతువు కానేరదు. ఇందుకు ప్రమాణము. శ్లో॥ "యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసా త్కురుతేర్జున, జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురుతేతథా" అనఁగా నగ్నిహోత్రుఁడు కట్టెలను భస్మముజేయునట్లు జ్ఞానాగ్నిచే సర్వకర్మములు భస్మమౌనని భగవద్వాక్యము గనుక జ్ఞానాగ్నియందు సంచితమనే బీజము దగ్ధమౌను. ఇఁక నాగామి యనఁగా నీజన్మమెత్తిన వెనుక చేసిన ధర్మకర్మములు. ఇది యుండెనేని జన్మాదులకు మూలమైన సంచితమై ప్రారబ్ధానికి వచ్చునంటివేని ఈ సంచితము జ్ఞానులకు జ్ఞానాగ్నిచే దహించి యుండుఁగావున నాయాగామియును అంటనేరదు. ఇది యేమౌననిన; ఆజ్ఞానులను పూజించువారికి పుణ్యమును, దూషించువారికి పాపమును, లభ్యమౌను. అనిన శిష్యుఁడు స్వామీ? జ్ఞానమనఁగా యదార్థముఁగదా. యదార్థముగా నాత్మయైన తన్నెఱిఁగిన వెనుక మిథ్యయైన ప్రారబ్ధ దేహముండుటకు కారణంబేమనిన ; శిష్యా యదార్థమైన రజ్జువందు మిథ్యయైన సర్ప భ్రమము దోఁచి వెఱచిన యెడ కాలికి రాయింతాకి గాయమైన వెనుక నన్యులచే నిది సర్పము గాదు రజ్జువని తెలుపఁబడి భయము నివృత్తికాఁగ నా సర్పభ్రమము లేక రజ్జువు తోఁచుగాని గాయము పోదుగదా. అటువలె నీశరీరము గల్గినపిమ్మటజ్ఞానముగల్గెగావున గాయమువలె నీశరీరమెన్నిదినములుండవలయునో అన్నిదినములుండి ప్రారబ్ధముతో తీరునుగనుక నప్పటికిస్వ స్వరూపానుసంధానముచే నుండవలయు. శ్రు॥ "స్వరూపానుసంధానంవినాన్యథాచార పరోనభవేత్" అనియున్నది గనుక నిట్టి స్వస్వరూపమైన బ్రహ్మజ్ఞానమునకు మూడువిఘ్నములు గలవు. అవియేవనిన? అసంభావన, సంశయ, విపరీతభావన, యనిమూడువిధములైయుండు. ఇందసంభావన యనఁగా నేదనిన? ఆత్మయనగా జ్ఞానస్వరూపము గనుక నాకంటితో చూచుచున్నాను, నాచెవులతో వినుచున్నాను, అని యీదేహమే ఆత్మయనియు. నీదేహముండిన సర్వభోగములుఁ గలవు, ఈదేహము లేకుండెనేని యేమియు లేదుగావున నీదేహమేయాత్మయని ఆత్మయైన తనను మఱచియుండుట యసంభావనయనఁబడు. సంశయ

మనఁగా; దేహేంద్రియాదులతోఁగూడి కర్తనై యున్న నన్ను శాస్త్రము నీవే బ్రహ్మమని చెప్పినను నేనే బ్రహ్మమైతినేని దేహత్రయములు లేక యుండవలయుఁగదా? బ్రహ్మము దేహత్రయవిలక్షణమని శ్రుతులు చెప్పుచున్నవిగనుక నే నెట్లు బ్రహ్మమౌదునని సంశయముచే నేను బ్రహ్మమౌదునో కానో యని శంకించుట సంశయము॥ ఇంక విపరీత భావనయనఁగా? శ్రుత్యుక్తులవల్ల నేను బ్రహ్మమైనను మునుపటి జీవభావంబును విడువలేదని సుఖదుఃఖములం జెందుట విపరీత భావన. ఈమూటిని శ్రవణ, మనన, నిదిధ్యాసంబుల వలన పోఁగొట్టవలయు. ఎట్లనిన; శ్రుతివాక్యములవలనసూతకాదులందు దృఢబుద్ధివచ్చినటువలెతానైన ప్రత్యగాత్మకు బ్రహ్మముతో నైక్యంబు యుపనిషద్వాక్యంబుల వలన షడ్విధలింగ తాత్పర్యంబు శ్రీగురువుల వలన నీవే బ్రహ్మమని దెలుపంబడి దృఢమైననిశ్చయబుద్ధిగల్గుట శ్రవణంబు. ఆయుపనిషద్వాక్యంబులను యుక్తులచేతంజింతించి యాత్మ నెఱుఁగుట మననంబు. ఆనిశ్చయంబైన యర్థంబును చిత్తంబుననిల్పి యానందించుట నిదిధ్యాసంబు, ఈమూటిచే నసంభావన, సంశయ, విపరీత భావనలను బారద్రోలవలయును. ఇందుకు దృష్టాంతము॥ పదుగురుపురుషులు నదిదాటి యందులోనొకఁడు నెదుటవచ్చిగణించి తానుదశముండని మఱచుటయసంభావన ఇదియే అజ్ఞానము. మఱియు నింకదశముండుండిన నగపడఁడోయనుటసంశయము. ఇదియేఆవరణంబు. మఱియు దశముఁడీనదిలోమృతిబొందెనని దుఃఖంచుట విపరీతము. ఇదియెవిక్షేపము. ఇందుకునివృత్తి వేరొక యాప్తవచనంబువలన మీయందు దశమపురుషుఁడు గలఁడని జెప్పుట శ్రవణంబు. మఱియు నీదశమపురుషునిం జేర్చి యెంచినీవేదశముండవని దెలుపుటెమననంబు, మఱియు దశమునింగాంచిసంతోషించుటె నిదిధ్యాసంబు. అనినస్వామి షడ్విధలింగము లనఁగా నెట్టివని న వత్సా? ఉపక్రమోప సంహారం బభ్యాసం బపూర్వత్వము ఫలంబు భూతార్థవాదంబు దృష్టాంతంబులని యారువిధములు ఉపక్రమమనఁగారజ్జువందు సర్పభ్రమము తోఁచినట్లు బ్రహ్మమందుజగంబుగలిఁగెననియు నీసృష్టికిపూర్వమందు స్వగతాది భేదరహితమై యఖండాకారమైన బ్రహ్మంబు సద్రూపమైయుండు ననుటయుపక్రమంబు. ఇఁక

నుపసంహారమనఁగా; నామరూపాత్మకంబై తోఁచిన యీజగత్తుదేని
యందుపుట్టినదో దానియందే క్రమక్రమముగా బ్రహ్మాండములయ
ముచేసి వ్యష్టి సమష్ట్యుపాధులైన జీవేశ్వర వాచ్యార్థములనువిడిచి ల
క్ష్యార్థములైన ప్రత్యగాత్మ బ్రహ్మములకు నైక్యమై యేకత్వము బో
ధించి యాబ్రహ్మం బద్వైతంబని ప్రతి పాదించుట యుపసంహారం
బు, ఇవిరెండు నేకలింగ మనఁబడు, ప్రత్యగాత్ముడైన తానేబ్రహ్మమ
నుచుపలుమారు జెప్పుట యభ్యాసం బనఁబడు. ఇంక నపూర్వ మ
నఁగా నష్టప్రమాణములలో నుపనిష త్ప్రమాణములచే ప్రత్యగాత్మ
లక్షణము దెలియుంగాని అన్యప్రమాణములచే దెలియనేఱదు. ఎట్లని
న; తిథివార నక్షత్రంబులం దెలియవలెనని పంచాంగంబు వలనం
దెలియుంగాని యితర శాస్త్రములవలన దెలియరానట్లు ప్రత్యగా
త్మ బ్రహ్మము దెలియుట కుపనిషత్ప్రమాణముల వలననే
తెలియవలయు ననిన విని శిష్యుఁడు స్వామి అష్టప్రమాణము
లనఁగా నేవియనిన; ప్రత్యక్షాను మానోపమానా గమార్థా
పత్త్య భావైతిహ్య సంభవములని వస్తుసిద్ధి కివియే అష్ట
ప్రమాణములు. ప్రత్యక్షములో సందేహప్రత్యక్షము, విపరీతప్రత్య
క్షము, యదార్థ ప్రత్యక్షమని మూఁడువిధములు. ఎట్లనిన. స్థానువుంగని
యదిస్థాణువో పురుషుఁడోయని సందేహించునది సందేహప్రత్యక్షము
పురుషుఁడేయని నిశ్చయించునది విపరీతప్రత్యక్షము. స్థాణువనియెఱుం
గునదియదార్థ ప్రత్యక్షము. దీనికిస్వరూపాభి ప్రాయమేమనిన. నేను
దేహమోఆత్మోయనుట సందేహప్రత్యక్షము. నేనుదేహమే యనుట
విపరీతప్రత్యక్షము. నేనుబ్రహ్మమని నిశ్చయించు నది యదార్థప్రత్య
క్షము. ఇంకనీసందేహ విపరీతములు నివర్తించుటకై యనుమాన ప్ర
మాణం బెట్లనిన; ధూమంబు వలనయగ్నియుండునని తెలుసుకొనుట
యనుమానంబు. ఈయనుమానములో ప్రతిజ్ఞా హేతు దృష్టాంతముల
ని మూఁడువిధములుగలవు. పర్వతంబునం దగ్నిగలదనుటయే ప్రతిజ్ఞ
అందుకేమి హేతువనిన, ధూమముండుటయే హేతువువలాగన్న; మ
హానసమున ననఁగా వంటయింట నగ్నియుండు ననుటే దృష్టాంతము
ఈప్రతిజ్ఞలో స్వరూపాభి ప్రాయమేమనిన; పంచభూతాత్మకమైన యె

కశరీరముఁగని యీశరీరములో జ్ఞానస్వరూపమైన బ్రహ్మముగలదని నిశ్చయించుట ప్రతిజ్ఞ. హేతువలో స్వరూపాభిప్రాయ మేమనిన; శరీరములో జ్ఞానస్వరూపమైన ఆత్మయుండి సర్వము నెఱుఁగుచున్నది. ఈ దేహేంద్రియములు జడములౌటచేత నెఱుఁగుటకు శక్తిలేదు. ఎట్లనిన; మరణమూర్ఛలందు దేహముండియు జ్ఞానము లేకపోవును గనుక దేహము జడము. ఇట్టిదేహేంద్రియ ములను జ్ఞానాకారము చేసి వీనికార్యముల నెఱింగెడు బ్రహ్మ మొకటిగలదని యెఱుఁగుట హేతువు దృష్టాంతమునందు స్వరూపాభిప్రాయమే మనిన; ఒక దేహమందు జ్ఞాన స్వరూపమైన బ్రహ్మముండుటఁగని సకలదేహములందు జ్ఞాన స్వరూపమైన బ్రహ్మముండునని తెలియుట దృష్టాంతము. అయితే సర్వభూత భౌతికములందు జ్ఞానస్వరూపమైన బ్రహ్మముగలదని యనుమానముచేత తెలియవచ్చినదిగాని ప్రత్యక్షముగా నిట్టిలక్షణము గలదని తెలియలేదు గనుక నాలక్షణము తెలియుటకై యుపమాన ప్రమాణము విచారింపవలయును. ఎట్లనిన; వనంబునఁ గవయమనగా నడవిగోవున్నదని వినిదానిలక్షణము దెలియవలయునని దెలిసినవారినడుగ వారు నీగోవువలెనే యుండునని జెప్పంగా నావాక్యంబువిని తాంబోయి వనంబులో నాగోవుంజూచి నిశ్చయించినజ్ఞానంబు ఉపమానంబు. ఇందుకు స్వరూపాభిప్రాయంబేమనిన; బ్రహ్మము నెఱుఁగ నిశ్చయించినవారు బ్రహ్మజ్ఞానులైనగురువులం భయభక్తిచే బూజించి, బ్రహ్మమనఁగా నెద్ది? యనియడుగ; వారు నది సచ్చిదానంద లక్షణమై యుండునని చెప్పి. తానను భవంబున నీలక్షణముగలదా లేదాయనిజూడ, స్థూలదేహము స్వప్నంబున లేదు, స్వప్నావస్థయైన సూక్ష్మదేహము సుషుప్తియందు లేదు, అటువలెనీకారణదేహమును జాగ్రతయందు లేదు. ఇటువలె నీదేహాదు లొకప్పుడుండి యొకప్పుడు లేకపోయిన నీదేహత్రయావస్థల నెఱుంగు ప్రజ్ఞానస్వరూపమైనయాత్మ తా నెప్పటికినుండుటచేత సద్రూపమౌననియు నీయాత్మే జడమయిన దేహత్రయములను జ్ఞానస్వరూపముగా ప్రకాశము చేసి నీదేహకార్యములకు తాసాక్షియై స్వయంప్రకాశముగా నుండుటచే చిద్రూపమౌననియు, నీయాత్మే దేశకాలవస్తుపరిచ్ఛేదమై దుఃఖమూ

లమైన దేహాదులులేక నానందముగా నుండుటచే నానందమానియు నీయానందము చిత్తశుద్ధిగలవారియం దనుభవమౌను. ఎట్లనిన; సూర్యుఁడు అంతట ప్రకాశించుచుండినను వృక్షపాషాణ కుడ్యాదులందు తోఁచకనిర్మలమైన జలదర్పణాదులందు నెటువలె ప్రతిబింబించునో అటువలెనీయానందము కామక్రోధాది చిత్తంబులందోఁచక సాధనచతుష్టయసంపత్తిగల నిర్మలచిత్తంబులందోఁచును. ఇటువలె ననుభవంబుచే నాత్మసచ్చిదానంద లక్షణంబుగలదని యెఱుంగుట యనుమానమునకు స్వరూపాభిప్రాయము. ఇట్టిలక్షణంబుగల బ్రహ్మంబుండు స్థలంబు దెలియుటకై ఆగమప్రమాణము విచారింపవలయు, ఎట్లనిన; స్వర్గంబున కామధేనువు కల్పవృక్షముం గలదని యాగమశాస్త్రంబులం జెప్పవిని నిశ్చయబుద్ధిగల్గుటయే యాగమప్రమాణము, ఇందుకుస్వరూపాభిప్రాయమేమనిన, శ్రు॥ "సయశ్చాయంపురుషః యశ్చాసావాదిత్యేసఏకః" అనఁగా నీ సర్వజీవుల యందుండు వాఁడెవఁడో అతఁడేసూర్యమండల మందుండి ప్రకాశించుచుండు. అతఁడొక్కఁడే యనియు; శ్లో॥ [ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణం మధ్యపూర్ణంశివాత్మకం] అనఁగా. పైనపూర్ణము, క్రిందనుపూర్ణము, మధ్యను పూర్ణమైయుండు నదియే బ్రహ్మము. నామరూపాత్మక దృశ్యమాయా ప్రపంచమును తోసివేసిన నంతటను బ్రహ్మమేయుండును. శ్లో॥ దృష్టింజ్ఞానమయీంకృత్వా పశ్యేద్బ్రహ్మ మయంజగత్॥ అనఁగా జ్ఞానముచేచూచిన విశ్వమన్నదిలేక నంతయు బ్రహ్మమైయుండునని యాగమములచే దెలియుటయే యాగమము. ఇట్టి సచ్చిదానందమైన యాత్మకు జ్ఞానోపదేశమునకు ముందు నీలక్షణము దెలియకపోవుటకు కారణమేమనితోఁచెను. సందేహ నివృత్తికై అర్థాభక్తి ప్రమాణము విచారింపవలయు. ఇందు దృష్టార్థా భక్తియనియు, శ్రవణార్థా భక్తియనియు, రెండువిధములు ఇందుదృష్టార్థా భక్తియనఁగా నేవనిన, నిత్యోపవాసియను పేరుగలయొకని దేహపటుత్వముజూచి యితఁడే కాంతముగా భుజించునని, యెఱుంగుటె దృష్టార్థాభక్తి. ఇందుకు స్వరూపాభిప్రాయ మేమనిన తనయొక్క సచ్చిదానంద లక్షణము తోఁచకపోయిన నాత్మానాత్మ విచారమువలన తానే సచ్చిదానందుండని యెఱుంగుటె దృష్టార్థాభక్తి.

ఇంక శ్రవణార్థాభక్తి యెట్టిదనిన, ఒక దేవదత్తునిజూచుటకై వానిగృహంబునకఱిగి యింటివారిని దేవదత్తుఁడున్నాఁడాయని యడిగినవారు లేఁడని జెప్పఁగా నతఁడన్యస్థానమందైనా యుండునని దెలుసుకొనుట శ్రవణార్థాభక్తి. ఇందుకు స్వరూపాభిప్రాయమేమనిన. నామరూపాత్మకములం దాత్మ లేదనినను వీటికి విలక్షణమై వీటి నెఱుంగుచు జ్ఞానము మిగిలి యుండునని యెఱుంగుట శ్రవణార్థాభక్తి. జ్ఞానమే ఆత్మయనిన, తానొకటిని యెఱుంగుట వలన నెఱుకయను నామముగల్గెం గావున నెఱుఁగఁబడు నామరూపమాయయును సత్యమై యనాదిగానుండవలయుననితోఁచెడు శంకపరిహరించుటకై అభావప్రమాణము విచారింపవలయు, ఎట్లనిన, ప్రాగభావము. ప్రధ్వంసాభావము. అన్యోన్యాభావము. అంత్యాభావమని నాలుగువిధములు. ఇందు ప్రాగభావమనఁగా, కులాలుఁడుచక్రమందుండు మృత్తికనుజూచి యిందుఘటము లేదనుట ప్రాగభావము. ఇందు స్వరూపాభిప్రాయమేమనిన, ఘటము లేని యభావమునకు అనాదిగానుండియు నిత్యత్వము సిద్ధించలేదు,ఎట్లనిన, కులాలుండు చక్రమునుద్రిప్పి మృత్తికయందు హస్తముంచినప్పుడు ముందు లేని ఘటము వుత్పత్తియైనదిగావున ముందుజెప్పిన యభావమునకనాదిత్వముండియు ననిత్యత్వము సిద్ధించెను. అటువలెనే మాయయును, జీవేశ్వర జగత్తులును, అనాదిత్వమని క్వచిత్ శాస్త్రములయందు జెప్పియున్నను విచారజ్ఞానముచే నశించిపోవుననుటయె ప్రాగభావప్రయోజనము. ఇటువలె విచారజ్ఞానముచే నశించిన మాయాకార్య జీవేశ్వర జగత్తులు విచారము లేనియడ ముందువలెనె తోఁచునను శంక పరిహరించుటకై ప్రధ్వంసాభావము విచారింపవలయు; ఒకదరిద్రుఁడు ఘటముచేకొని భిక్షయెత్తుచుండ నొకనాడు రాతిపైబడి యాఘటముపగిలి తునుకలౌటజూచి వాఁడునాఘటముపై యాశచే పొర్లిపొర్లి యేడ్చినను పగిలిన ఘటము రాకపోవుట ప్రధ్వంసాభావము. ఇందులో స్వరూపాభిప్రాయమేమనిన, ముందు విచారజ్ఞానముచే నశించినమాయాజగత్తు తిరుగాకల్పిత కాలములో కలుగనేరదని యెఱిగినదే స్వరూపాభిప్రాయము. ఘటముపగిలియు కారణమైన ఘటముగాక పెం

కనేకార్యమే తోచునట్లు విచారజ్ఞానముచే నశించినజగత్తు కారణమైన బ్రహ్మముగాక కార్యమైన జీవేశ్వరులుగాఁ దోచియుండుటచే బ్రహ్మములో మాయయున్నది మాయలో బ్రహ్మమున్నదనే శంకపరిహరించుటకై యన్యోన్యాభావము విచారింపవలయు. పటములో ఘటమును ఘటములో పటమును, కాలత్రయమందును లేదనితెలియుట యన్యోన్యాభావము. ఇందులో స్వరూపాభిప్రాయమేమనిన; సత్తు, చిత్తు, ఆనందమైనది బ్రహ్మము; అసజ్జడ దుఃఖస్వరూపమై, అనిర్వాచ్యమైనది మాయాస్వరూపము. ఇటువలె నొకటికొకటివిరుద్ధమైయుండును. ఎట్లనిన; సూర్యునందుచీకటి, చీకటియందు సూర్యుండులేనట్లు బ్రహ్మమందుమాయ. మాయయందు బ్రహ్మము లేదని దృఢముగా ననుభవముచే తెలియుట స్వరూపాభిప్రాయము. ఇటువలె ననుభవముచే సమాధియందు లేకపోయినను సమాధివిడిచిన వెనుక నామరూపాత్మకమైన ప్రపంచముతోచుటచే మాయలేకున్న ప్రపంచము లేకుండవలయు గనుక మాయయుండు ననితోచు. సందేహము పరిహరించుటకై యత్యంతాభావము విచారింపవలయు. కలలోను తామృతిబొందినట్లు యదార్థముగాఁ దోచినను. జాగ్రతలో నదేమియు లేకమిథ్యయై యబద్ధమనితోచుట యత్యంతాభావము. ఇందులో స్వరూపాభిప్రాయమేమనిన; ఈనామరూపమైన జగత్తజ్ఞాన కాలమందుతోచినను జ్ఞానారూఢకాలమందు మిథ్యయైయుండు గనుక నెప్పటికి మిథ్యయనే తెలియునది. ఎట్లనిన; గగనారవిందమని జెప్పినచో గగనమనఁగా శూన్యముగదా? అందుపువ్వము పుట్టనేరదనేదృఢానుభవము గల్గునటువలెనే బ్రహ్మమందు మాయ లేదని దృఢముగా తెలియుట స్వరూపాభిప్రాయము. ఇటువలె మాయలేకయుండియు కొందఱికి యున్నట్లుతోచుట యేమనిగలిగెడు సందేహనివృత్తికై ఐతిహ్యప్రమాణము విచారింపవలయు. ఒకఁడు మానుమీద నెక్కి యాకులుగోయుచుండ వేరొకఁడు వానింజూచి యోరీ? పిచ్చివాఁడా? ఈచెట్టుమీద. భయంకరమైన బ్రహ్మరక్షస్సున్నది; ఇందుకుజడిచి యెవ్వరు స్రీమానిచెంతకు బోవెఱతురు. నీవెట్లెక్కితివని చెప్పినంతలో నామాటవిని భయకంపితుండై దిగువ బడుట ఐతిహ్య

ప్రమాణము. ఇందు స్వరూపాభిప్రాయమేమనిన; మాయాకార్యమైన జీవేశ్వరులు మిథ్యయైనప్పటికి ప్రత్యక్షముగా నగుపడని బ్రహ్మారక్షస్సును వార్తవిన్నంత మాత్రాన జ్వరకంపితములు గలిఁగి యదార్థబుద్ధివచ్చినట్లు మాయాకార్య జీవేశ్వరులు మిథ్యలైనను అజ్ఞానభ్రాంతిచే తోఁచునని తెలియుట స్వరూపాభిప్రాయము. మాయ లేనియెడ మాయాకార్యమైన భూతభౌతికాదులు పరిపరి విధములుగాఁ దోఁచుటకు కారణమేమనితోఁచెడు శంక నివృత్తికై సంభవ ప్రమాణము విచారింపవలయు. సహస్రసంఖ్యలో దశము, శతము, అను సంఖ్యలున్నట్లు తెలియుట సంభవ ప్రమాణము ఇందు స్వరూపాభిప్రాయమేమనిన, పరిపూర్ణ బ్రహ్మమందు వ్యష్టి సమష్ట్యాత్మకమైన జీవేశ్వర ప్రపంచంబుండుననియు నన్నిటను తానుండుననియు నెఱుంగుట స్వరూపాభిప్రాయము, ఇదియె యపూర్వతలోని యష్టప్రమాణములు. ఇంక ఫలంబనఁగా నేకప్రత్యగాత్మ నెఱింగిన సర్వంబు నిటువలెనే యుండుననియు, సర్వము బ్రహ్మమనియు, బ్రహ్మమాత్రమైయుండుటే ఫలంబు. ఇంక భూతార్థ వాదమే మనిన, నిర్వికార బ్రహ్మంబునకు సృష్ట్యాదిచింతన కలదనియెడు న్యాయంబువలనఁ జగత్సృష్ట్యాద్యనుగ్రహంబైన పంచకృత్య కేతృత్వము గలఁదనుట భూతార్థవాదము. నిర్వికారద్వైత బ్రహ్మస్వరూపకుండగు ఈశ్వరునియందు సృష్ట్యాదికృత్యంబు లేవిధముగా నగుననిన; సూర్యుఁడేలాగున నిచ్ఛాప్రయత్నములులేక తనవర్షకిరణంబులచే వృష్టిరూపమై జలంబును విడిచియాజలంబున తాను ప్రతిబింబించి మేఘాదులచే తనబింబంబులనడఁగించి ఉష్ణకిరణంబులచే నాజలంబును మగుడ గ్రహించి యందలి ప్రతిబింబంబును తనలో నెట్లు జేర్చుకొనునో అటువలెనే ఈశ్వరుఁడును మాయతో గూడి చిత్ప్రధానంబుచేత నిమిత్తకారణంబై తనయందుగలిగిన జడప్రధాన మాయనే యుపాదాన కారణముచేసి బుద్ధీంద్రియాది జగంబుల సృష్టించి జీవరూపంబుచే తానందుబింబించి కర్మముచేభోక్త యనిపించుకొని నియమనశక్తిచే కర్తయై రుద్రరూపంబుచే నా కార్యరూపంబుల సంహరించి శ్రీగురురూపంబుచే నాజీవుని తనలో నైక్యంబుచేసుకొనును. ఇంక నుత్పత్తి యెద్దియనిన; ఘటం

బునకు మృత్తికయు, తంతువునకు నూర్ణనాభియు, కటకమకుటాదులకు సువర్ణంబును కారణమైన ట్లీజగంబునకు బ్రహ్మంబే కారణంబనియు, బ్రహ్మమునకు జగత్తున కభిన్నత్వము ప్రతిపాదించునది యుత్పత్తిదృష్టాంతము. ఈషడ్విధలింగ తాత్పర్యము కారణాచార్యులచే బోధపొందవలయును. ఇందులో బోధ మూడువిధంబులై యుండు. ఎట్లనిన; ఉద్దేశ, లక్షణ, పరీక్షయని మూడు విధములు. ఇందుద్దేశమనఁగా; తానెఱింగింపఁదగిన వస్తువు నామమాత్రంబు జెప్పుట యుద్దేశమనంబడు. నిందుస్వరూపాభిప్రాయ మేమనిన; శిష్యుఁడు సద్గురువులంజేరి సాష్టాంగ నమస్కారములుజేసి స్వామీ? నేతాపత్రయములచే దహింపఁబడు చున్న వాఁడ, నాయందుకరుణించి జన్మమరణాదులులేక మోక్ష మేవిధముగాగల్గును, మోక్షనాథుం డెవ్వండని యడుగఁగా; వత్సా? సర్వచరాచర ప్రభువైన పరబ్రహ్మమొక్కఁడే మోక్షనాథుఁడు. యతని నీకుపదేశరూపముగా దెల్పెదనని యితరదేవతామంత్రముల నుపదేశముజేయక పరబ్రహ్మ ప్రతిపాదక మయిన మంత్రము నుపదేశించుట యుద్దేశము. ఇట్టిపరబ్రహ్మము యొక్కలక్షణము దెలియుటకై లక్షణవిచారిం చవలయు. అదియెట్లనిన. గంగడోలుగలది గోవనుటవలె నావస్తువుయొక్క సాధారణ ధర్మంబు జెప్పుటలక్షణయనఁబడు. ఇందుకుస్వరూపాభిప్రాయ మేమనిన, ముందుపదేశముచేసిన పరబ్రహ్మకా సత్తు, చిత్తు, ఆనందమనే లక్షణముగలదా లేదాయని తెలియుటకై పరీక్షవిచారింపవలయు, పరీక్షయనఁగా, ముందుజెప్పిన గోవునకు నాలక్షణంబు గలదా లేదాయని చూచుట. ఇందులో స్వరూపాభిప్రాయ మేమనిన, ఆత్మానాత్మ విచారముచే నీభూత భౌతికాది మాయాప్రపంచము సజ్జడదుఃఖ స్వరూపమని విచారజ్ఞానముచేఁ గని వీటినొకటొకటిని నిషేధింపఁగా నెచ్చటసచ్చిదానందపూర్ణలక్షణముండ ననుభవముచేగాంచి తన్మయుండై బ్రహ్మనిష్ఠయందుండుట స్వరూపలక్షణ. ఇటువలె నుపదేశము చేయక నన్యదేవతామంత్రముల నుపదేశించి శిష్యవిత్తాపహారకులై కర్మములం బెట్టువారిని కార్యగురువు లని యెఱుంగునది. అనినవిని శిష్యుఁడు హేగురూత్తమా? లోకంబున ననేకులు కార్యగురువులనే యనుసరించి

యుండుటకు కారణమేమనిన, వత్సా? అది యజ్ఞాన మహిమెఱుంగున ది. ఎట్లనిన, వేషభాషలచే వలపించువేశ్యలందు జారులజ్ఞానముచే మోహముగొని సద్ధర్మ పత్నులందు విరక్తిగొన్నట్లు వేషధారులైన లోకగురువులం బూజించి యనుసరించినట్లు కారణగురువుల ననుసరించుటకు పూజించుటకు బుద్ధిగలుఁగ నేరదు॥

ఇతి స్వరూప ప్రకరణము సమాప్తము.

---

## సమాధి ప్రకరణము.

శ్లో॥ "స్వానుభూతిరసావేశా దృశ్యశబ్దా ఉపేక్షితః । నిర్వికల్ప సమాధిశ్చ నివాతస్థితదీపవత్" అనఁగా స్వానుభవరసామృతమందుమునుఁగుటవలన దృశ్యములున్ను, శబ్దములున్ను లేక గాలిలేనిదీపమువలెయుండుటయే నిర్వికల్పక సమాధియనఁబడును, ఇందుకుదృక్ దృశ్యవివేకముచేతనే సమాధిపొందవలయు. అదియెట్లనిన, దృశ్యమనఁగా నామరూపమైన ఘటపటాదివిశ్వ మొకవస్తువును జూడనేరక జడమై ఇంద్రియములచే జూడబడుచున్నది గనుక దృశ్యములనఁబడును. దృక్కనగా నేత్రశ్రోత్రేంద్రియాదులీఘటపటాది విశ్వముచేత తెలియఁబడక తామన్నిటి జూచుటచేత యింద్రియములే దృక్కని చెప్పఁబడెను. ఇటువలెనే దేహేంద్రియాదులున్ను జడమై ఇదినేత్రము ఇదిశ్రోత్రమని అంతః కరణచే తెలియఁబడుచుండు గావున నివిదృశ్యములనఁబడును. ఇట్టిజడమైన యింద్రియములచేత తెలియఁబడక ఇవి జ్ఞానేంద్రియములు నివికర్మేంద్రియములు నివివీటి విషయాదులని వీటి నెఱుంగుచుండెడి యంతఃకరణమే దృక్కనఁబడెను. ఇట్టి యంతఃకరణమున్ను జడమై సంకల్ప వికల్పాది గుణములుగలదియై, ప్రత్యగాత్మచే తెలియబడుచుండుగనుక దృశ్యమనఁబడును. ఇట్టిదృశ్యమయిన యంతఃకరణము దేహేంద్రియాది విశ్వమున్ను ఇవి యన్నియు నేగానని కడద్రోయఁగా మిగిలి వీటినెఱుంగుచుండెడి ప్రత్యగాత్మజ్ఞానమేబ్రహ్మము. ఇటువలె ఋగ్వేదమందు [ప్రజ్ఞానంబ్రహ్మ] మని చెప్పియున్నది. ప్రజ్ఞానమన్నను, ప్రత్యగాత్మ యన్ననొక్కటె. ప్రత్యగాత్మ యనియు, బ్రహ్మమనియు నెందుకనవలెననిన; అంతః కరణముండుటచే తత్సాక్షి

మైనందున ప్రత్యగాత్మ యనఁబడెను. ఆయంతః కరణము మాయవల్ల గలిగెను గనుక మిథ్యయనఁబడును. ఎట్లనిన॥ శ్రు॥ [యామానామాయా] అని చెప్పియున్నది గనుక మాయయనఁగా లేనిదిఇందుకు దృష్టాంతము, మాయయనఁగా గగనారవిందమువంటిది. అంతః కరణమనఁగా నాయాకాశ పుష్పవాసన వంటిది. గగనమున పుష్పమెటువలె పుట్టలేదో, అటువలె నాపుష్పవాసనయును లేదని యెఱిఁగినట్లే బ్రహ్మమందు మాయ లేదు గనుక మాయాకార్యమైన యంతః కరణమున్ను మిథ్యే కాఁబట్టి ఆయంతః కరణమునకు సాక్షియైన ప్రత్యగాత్మకు ప్రజ్ఞానమనే నామముబోయి॥ శ్రు॥ [సత్యంజ్ఞానమనంత మానందం బ్రహ్మ] అని చెప్పబడెను. ఇందుకర్థం, జ్ఞానాజ్ఞానములు లేక భవనాశనములు లేక యెప్పటికి శాశ్వత జ్ఞానమైయుండు నదియే సత్యజ్ఞానము. అంత్యములేని అపరమితానందమే అనంతమానందము. సజాతీయ్య విజాతీయ్య స్వగత భేదరహితమయి దేనికంటె గొప్పది లేక బ్రహ్మశబ్దముచేత వర్ణింపఁబడ్డదో అదియే బ్రహ్మము. ఈమాయాంతః కరణములు వంధ్యాపుత్రుని వంటిది గనుక జీవేశ్వరోపాధులైన ఈ యుపాధిద్వయము మిథ్యలాయెగనుక జీవేశ్వరులనే వ్యష్టిసమష్టులు లేక సర్వమును బ్రహ్మమాయెను. ఇందు కుదాహరణము. శ్రు॥ "సర్వం ఖల్విదంబ్రహ్మ నేహనా నాస్తికించన" అనఁగా సర్వము బ్రహ్మము బ్రహ్మమునకువినా కించిత్తయినను లేదు. ఈ మహావాక్యార్థ మిట్టినిష్ఠగలవారికే అనుభవమౌను. ఇదియే నిర్వికల్పక సమాధి. ఈదృగ్ దృశ్యవివేకంబునకే యింకొక పక్షంబుచే దెలిపెదము. ఎట్లనిన, స్వగతమనియు, సజాతీయ్యమనియు, విజాతీయ్యమనియు, త్రివిధ భేదములు దృక్కుయందు నిరాకరింపతగినది. స్వగతమనఁగా, నొక వృక్షంబునకు పత్రపుష్పఫలాదులే స్వగత భేదము. ఇందు కనుభవార్థమెట్లనిన, దృక్కైన సద్రూపబ్రహ్మంబు గగనమువలె నంతటాపూర్ణమై నిరవయవమైయుండు గావున. శ్రు॥ "నచక్షుర శ్రోత్రమపాణిపాదం" అనఁగా. చక్షురాదీంద్రియాదులు లేనిదిగావున నీస్వగత భేదము బ్రహ్మమందు నిరాకరింపతగినది. ఇంక సజాతీయ్యమనగా వృక్షమునకు వృక్షాంతరమె సజాతీయ్యము ఎట్లనిన. మఱ్ఱిచెటునకు మఱ్ఱి

చెట్టు వృక్షజాతి మందేకమయ్యు ద్వివిధమయియుండు గనుక నిదిస జాతియ్య భేదమనంబడెను. ఇందు కనుభావార్థ మెట్లనిన, జీవేశ్వరులకు సచ్చిదానంద లక్షణంబు లొక్కటయ్యు ఉపాధులైన మాయాంతఃకరణములు తత్కార్యములు వేరువేరుగా నుండుటవలన సజాతియ్యభేద మనంబడెను. ఈ మాయాంతఃకరణములు బ్రహ్మమందు శశవిషాణ వంధ్యాపుత్రులవలె లేనివిగావున నీమాయాంతఃకరణోపాధులైన జీవేశ్వరులనే నామములున్న మిథ్యలేగనుక యెప్పటికి బ్రహ్మము నొక్కటై యుండుటచే నీసజాతియ్యభేదము బ్రహ్మమందు నిరాకరింప తగినది, ఈరెండు లేకపోయినను విజాతియ్యభేదంబైన లేదాయనిన, లేదు అదెట్లనిన, విజాతియ్యమనంగా, వృక్షమునకు పాషాణాదు లన్యజాతమగుటచే విజాతియ్య భేదమనంబడెను. ఇందుకనుభవార్థ మెట్లనిన, బ్రహ్మమున కన్యమయిన మాయాకార్యమగు జగత్తుగలదన్న చిత్రంబునంగల గిరిగోపుర వనజనాదులకు చిత్రకారకునకు వినా చిత్రంబునకు స్వాతంత్ర్యంబున్ను, ఆధారంబును తోచుటలేదు. కావున చిత్రంబుజెరుచుటకు సృజించుటకు చిత్రకారకునకే స్వాతంత్ర్యంబు గల్గునట్లు నీమాయాకార్యమగు జగంబు సృష్టించుటకు లయముజేయుటకు స్వాత్ర బ్రహ్మంబువినా మాయకన్యంబగు విలక్షణత్వంబు లేకయుండుటవలన విజాతియ్య భేదంబు బ్రహ్మమందు నిరాకరింపదగినది. ఇందు కుదాహరణము. శ్రు॥ [ఏకమేవా ద్వితీయ్యం బ్రహ్మ] అనంగా నప్పటి కన్యంబు లేక నేకమైయుండు నదియే బ్రహ్మము. ఇట్టిమహావాక్యానుభవము గలిగియుండుటే నిర్వికల్పసమాధి. సమాధియనంగా బ్రహ్మమందు మనస్సులయించుటె. మనస్సు, బ్రహ్మాకారమై పరిణమించుటేముక్తి. మనస్సు బ్రహ్మమందు లయమౌననుటకు దృష్టాంతము. శ్లో॥ [సలిలేసైంధవం యద్వత్సామ్యం భజతి యోగతః । తదాత్మ మనసోరైక్యం సమాధిరభిధీయతే] అనంగా; జలమున లవణముగిలసి జలమయమగునట్లు బ్రహ్మమున మనస్సుగలసి బ్రహ్మమయమగును. ఇట్లుండుటే సమాధి. మనోమయమే జగత్తు గనుక మనోమయమైన జగత్తు మనస్సుతోనే బ్రహ్మమయమాయె గనుక సర్వము బ్రహ్మమే శ్రు॥ [బ్రహ్మణోన్యం నకించన] అనంగా;

బ్రహ్మమునకువినా కించిత్తులేదు ఇందుకు దృష్టాంతము. సూర్యుఁడస్తమించుతోడనే సూర్యునికిరణము లతనితో జనునటువలె మనస్సులయించెనేని మనోవికారములైన దేహేంద్రియాది ప్రపంచము లేకయుండును. ఇందు కనుభవమెట్లనిన: మనస్సు సుషుప్తియం దణంగియుండుకాలంబున మనోమయమైన దేహేంద్రియాది ప్రపంచము లేకయుండు. తిరుగా నామనస్సు మేలుకొనుఁ తోడనె మనోమయమైన దేహేంద్రియాది ప్రపంచము తోచియుండు గావున నీమనస్సే బంధమన్నను, మోక్షమన్నను, జీవుఁడన్నను, ఈశ్వరుఁడన్నను, కార్యకారణములన్నను, తానైయుండు గావున నిట్టిమనస్సుచే దేహేంద్రియాదుల నొక్కొక్కటి వీక్షించి యిది నేఁగా నిది నేఁగానని, [నేతినేతీతి వాక్యార్థం శేషితంపూర్ణముచ్యతే] యను మహావాక్యము ద్వారా సర్వమున్ను గడద్రోచి తుదకమనస్సున్ను నేగాననఁగా మిగిలినదే పరిపూర్ణబ్రహ్మము. ఇదియే అమనస్క రాజయోగసమాధి. ఇదియె పరమరహస్యము. ఇటువలెనే శ్రీహరి బ్రహ్మకున్ను, సూర్యునకున్ను, ఉపదేశించెను దక్షిణామూర్తి సనకాది పరమహంసల కుపదేశించెను. ఇదియుసిద్ధాంతము, ఇది యనుభవజ్ఞానము. ముందు జెప్పిన నాల్గు మహావాక్యములు వేదాంతము, అదివిచార జ్ఞానమని యెఱుంగునది ఇట్టి సమాధినిష్ఠులగు మహాత్ములు పూర్వసాధనలైన భక్తియోగసాంఖ్యంబుల విడిచియుండుదురు. శ్లో॥ [నావార్థీ తు భవేత్తావద్యావత్పారంన గచ్ఛతి । ఉత్తీర్ణేచ సరిత్పారే నౌకయా కింప్రయోజనం] అనఁగా; నెంతపర్యంతము నదీతీరమును చేరఁడో, అంతపర్యంతముదాటుటకొఱకు నావల నపేక్షించును. అదిదాటిన వెనుక నావతోపనిలేనట్లు శాస్త్రసాధనాదుల నీమహాత్ములు విడుతురు. ఈబుద్ధోత్తములు సంసారమందుండినను తద్దోషంబుల నంటక నేయుందురు. యట్లనిన; స్త్రీవేషధారియైన పురుషుఁడు స్త్రీచిహ్నితములైన విరహతాపంబుల బొందినట్లభినయము గనపఱచుచు నవ్వేషంబుచే నుండినను తాపురుషుఁడను దృఢజ్ఞానముగలి యవ్వేషమందు నిరభిమానయైయుండుటచే తద్గుణంబుల నంటక నేయుండును. ఇటువలెనే జ్ఞానులున్ను తాము ఆత్మస్వరూపులమను దృఢానుభవ జ్ఞానముండుటచే

సంసారమందున్నను నిరభిమానులై యుందురుగావున తద్దోషంబుల
నంటక నేయుందురు. బ్రహ్మనిష్ఠులు సంసారమందున్నను ఆసక్తిలేక
యుందురనుటకు దృష్టాంతము. సూర్యునికి మిత్రములైన పద్మములు
రాత్రు లిందున్నను ముకుళించియుండుగాని దివమున వికసించియున్న
ట్లు రాత్రులందుండవు - తెక్కినకలువలు రాత్రులందు వికసించి దినం
బున ముకుళించియుండును. ఇటువలెనె బ్రహ్మనిష్ఠులు సంసారమందు
న్నను ఆసక్తిలేకనే యుందురు. ఇట్టిబ్రహ్మవేత్తలు సంసారమందున్న
నంటక నేయుందురు. ఎట్లనిన; కుమ్మరపురుగు బురదయందున్నను
బురదనంట కున్నట్లుందురని యెఱుంగునది. ఈయోగీంద్రులు సంసా
రకర్మయందున్నను చెలింపక యెప్పటికి బ్రహ్మమందే ద్రిష్టిగల్గియుం
దురు. ఎట్లనిన; నాట్యతాళ గానాభినయంబుల జేయుచు శిరంబునం
దున్న కలశమందే దృష్టియందు నాట్యశీలునివలె బ్రహ్మమందే దృష్టి
యుంతురని యెఱుంగునది ఈయతిశిఖామణులకు ధర్మకర్మలు మిథ్య
లై యుండును ఎట్లనిన? స్వప్నంబునం జేయు ప్రభుత్వ భిక్షుకత్వము
లు మేలుకాంచినేని మిథ్యలైనట్లు శర్మకర్మలు మిథ్యలైయుండును
ఈమునికులోత్తములు సంసారమందున్నను నడవియందున్నను దిగం
బరులైయున్నను ప్రభుత్వముఁ జేయుచున్నను బిక్షుకులైయున్నను శ్రౌ
తస్మార్తకర్మములు జేయుచున్నను లేక జేయకున్నను విధినిషేధములు
లేక నెటువలెనుండినను నీయందరికి మోక్షము సమానమై యుండు
ను. ఎట్లనిన; ఋజుకుటిలగతులు భేదములైనను సర్వనదులకు సము
ద్రమేగతి యైనట్లు నీపరమపురుషులకు నడతలు భేదమైనను మోక్ష
ము సమానమైయుండును. శ్రు॥ [సతద్జ్ఞానోశాలో న్మత్త పిశాచ వ
జ్జడవృత్యాలోక మాచరేత్] తచ్ఛబ్దార్థమైన బ్రహ్మమును యెఱిఁ
గినయతిఁడు బాలునివలెను వెఱ్రివానివలెను పిశాచమువలెను వివేక
ము లేనివానివలెను లోకమందు చరించును. బ్రహ్మనిష్ఠులు నానావి
చిత్ర చరిత్రంబుల నుందురనుటకు దృష్టాంతము. జనక, శుక, శౌన
క, భరత, యాజ్ఞవల్క్య, వామదేవ, ప్రహ్లాద, గౌతమ, వసిష్ఠ,
వాల్మీకి, విశ్వామిత్ర, దూర్వాస, వ్యాస, నారద, కపిలాదుల వర్త

మాంసభేదంబులే నిదర్శనంబులుగా నెఱుంగునది. జ్ఞానామృతముచేత కృతకృత్యుఁడైనయోగికి దేహ వర్ణాశ్రమాది కర్తవ్యములేదు. ఇం దుకు ఆచార్యస్వాములు చెప్పినది. శ్లో॥ నాహంజాతోన ప్రవృద్ధో నసష్టః, అనిచెప్పియున్నారు. మహావాక్య రత్నావళియందు. శ్లో॥ "జ న్మమృత్యు సుఖదుఃఖవర్జితం జాతినీతి కులగోత్రవిదూరం" అనిచె ప్పియున్నది గనుక కర్తవ్యముండరాదు. వుండినట్టాయనా తత్వవేత్త గాఁడు. ఈగ్రంధము యవరు చదువుచున్నారో, వినుచున్నారో, వా రీ సంసారసముద్రమును సులభముగా దాటి సంసారానకు పరమైన ముక్తినిపొందుదురు. ఈయర్థమందు వసిష్ఠుండు, శ్రీరామున కుపదే శించిన ధర్మమేదనిన. శ్లో॥ మహానుభావ సంపర్క స్సంసారార్ణవలం ఘనే। యుక్తస్సం ప్రాప్య తేరామ యథానౌ వనావికాత్॥ అనఁ గా? మహానుభావుల సాంగత్యము సముద్రమును నోడయెటువలెదా టించునో అటువలెనే సంసార సముద్రమును బ్రహ్మవేత్తలు దాటిం తురు. వత్సా? శుభకార్యములకు అనేకవిఘ్నములు గల్గునని గురుగీ తలయందు జెప్పియున్నది. శ్లో॥ గురువో యత్రపూజ్యంతి యోగి నాం త్రిత్రపూజ్యతా। శ్రేయాంసి బహువిఘ్నాని శిష్యజాగ్రతి జా గ్రత॥ అనగా? పరబ్రహ్మమే తటస్థలక్షణచే గురురూపమునవచ్చి శి ష్యులకు మోక్షమిచ్చుచున్నాఁడు గనుక శిష్యులైన యోగులు స గుణోపాస్తిగా గురువులనంత భయభక్తి విశ్వాసములుగల్గి పూజిం తురో, ఆయోగులు త్రిలోకములయందున్ను విశేషముగా పూజిం పఁబడుదురు. శుభకార్యములకు అనేకవిఘ్నములుగల్గు గావున శి ష్యా బహు జాగ్రతజాగ్రత, అనిన శిష్యుఁడు లేచి తన యానందబా ష్పంబులచే శ్రీగురు చరణారవిందంబుల కభిషేకంబుజేసి హృదయప ద్మమందు పుష్పముచే పూజించి పునఃపునః ప్రణామంబు లాచరిం చి మీరద్వితీయ్యు లౌటచే స్తుతిజేయంజాలనని అద్వితీయ్య బ్రహ్మని ష్ఠాభినయముచే స్తుతిగనపరచి శ్రీగురుపాదములపై బడియున్న శిష్యు ని దయచేతలేవనెత్తి మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుఁడవై సత్య జ్ఞానానందాద్వయ బ్రహ్మనిష్ఠచే నుండుట నీకు స్వభావమే గనుక నీనిష్ఠకు యేదోషవిఘ్నము లేకపోవునుగాక యని ఆశీర్వదించి నీ

పుబ్రహ్మనిష్ఠుండవని నామమిచ్చి యంతర్ధానంబు నొందె. అంత శి
ష్యుండానందభరితుండై నిరంతర నిత్యానందాద్వయ బ్రహ్మనిష్ఠ చే
యదేచ్ఛముగ నుండెను.

సమాధిప్రకరణము, సమాప్తము.



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్బ్రహ్మాద్వైశిష్ట
సిద్ధాంత నిర్ధారణులైన అన్నావధూత స్వాములశిష్యులును రాజనా
లాన్వయ సింధుసోమ నరసింహు పుత్రులునగు శ్రీమద్వేంకట సదా
నందయోగి విరచితంబైన సర్వవేదాంత పరమరహస్యంబగు కైవల్యా
మృతమోక్ష గ్రంథము సమాప్తము.

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు.



పూర్ణస్యావాహనంకుత్ర సర్వాధారస్య చాసనం। స్వచ్ఛస్య
పాద్యమర్ఘ్యంచ శుద్ధస్యాచమనంకుతః । నిర్మలస్య కుతస్నానం వ
స్త్రంవిశ్వోదరస్యచ । నిర్లేపస్య కుతోగంధః రసస్యాభరణంకుతః । ని
రాలంబస్యోపవీతం పుష్పం నిర్వాసనస్యచ । నిర్గంధస్య కుతోధూ
పః స్వప్రకాశస్యదీపకం । నిత్యతృప్తస్య నైవేద్యం తాంబూలంచక
థంవిభో । స్వయం ప్రకాశమానస్య కుతోనీరాజనంవిధిః । ప్రదక్షి
ణమనంతస్య అద్వితీయస్య వాస్తుతిః । అంతర్బహిశ్చ పూర్ణస్య కథ
ముద్వాసనం భవేత్ । ఇయమేవ పరాపూజా సర్వావస్థా సుసర్వ
దా । ప్రేమబుధ్యాతు సర్వేశీ మనోదేవో నివేశయేత్ । ఏషామ
జ్ఞానజంతూనాం సమస్తారిష్ట శాంతయె । యద్యదోబ్ధద్వ్యమఖిలం త
త్తచ్ఛక్త్యా బ్రవిమ్యహం । శ్రవణంకీర్తనంచైవ స్మరణంపాదపూజనం।
అర్చనం వందనందాస్యం సఖ్యమాత్మ నివేదనం । జలశైత్యాదికంయ
ద్వ జలవాసం ననంస్మరేత్ । దర్శనం స్పర్శనంకేళిః కీర్తనం గుహ్య
భాషణం । సంకల్పో ధ్యవసాయశ్చ క్రియానిర్వృతిలేవచ । ఏతన్మై
థున మష్టాంగం ప్రవదంతి మనీషిణః । విపరీతం బ్రహ్మచర్యం అను
ష్ఠేయం ముముక్షుభిః ॥ అస్వార్థః । స్త్రియః । రాగపూర్వక స్త్ర్యాది

విషయకం జ్ఞానం దర్శనం । తత్పూర్వకం క్రియావిశేష జన్యం జ్ఞానం స్పర్శనం । రాగపూర్వక పరిహాసాది వ్యవహారః కేళిః । స్త్ర్యాదేః అనురాగపూర్వక సౌందర్యాది వర్ణనం సంకీర్తనం । గుణవర్ణనం గుహ్యభాషణం రహసి సంభాషణం । అనుభవేచ్ఛా సంకల్పః । అధ్యవసాయః । అనుభవామీత్యాకారక నిశ్చయః । అనురాగపూర్వకాణిఏతాని మైథు నాన్యభిధీయంతె। ఏతదష్టకరహితో యః సఏవ బ్రహ్మచారీ । తస్యముక్తిః కరస్థా॥ తథాచశ్రుతిః । యస్యస్త్రీతస్య భోగేచ్ఛానిస్త్రీకస్యక్వభోగభూః । స్త్రియంత్యక్త్వా జగత్త్యక్త్వా జగత్త్యక్త్వా సుఖీభవేత్ ॥

కించ ॥ అజిహ్వష్షండకః పంగురంధో బధిరఏవచ । ముగ్ధశ్చముచ్యతే భిక్షు ష్షడ్భిరేతై ర్నసంశయః । అజిహ్వాఇతి । రసనారహితోన । కింతుమమేదం ప్రియమిద మప్రియమిత్యనుక్త్వా యదృచ్ఛాహారీసత్యవాక్ మితభాషీ । అజిహ్వాఇత్యుచ్యతె । షండకోనామ। శిశ్నరహితోన। కింతుశిశుయువతీ.వృద్ధాసుస్త్రీషుసతీషు సమబుద్ధిర్యోవర్తతెసషండః । పంగుర్నామ । నాంగహీనః । కింతు । అహోరాత్రమాత్రం గ్రామె సంచారః । పురీషోత్సర్జనార్థం బహిస్సంచారః యస్యవర్తతెపంగుః । అంధోనామ నచక్షుహీనః । కింతు । యస్యముముక్షోర్యుగ చతుష్టయ ప్రమాణదేశా త్పరతోదృష్టి నచలతిసోంధః। బధిరః శబ్దగ్రహణా సమర్థోన। కింతు సర్వేషాంవాక్యానాం శ్రవణె హితాహితత్వ బుద్ధిర్యస్య నాస్తిసబధిరః । ముగ్ధోనామ । మూఢోన కింతువిషయ సన్నిధానె సత్యపి ఇంద్రియపాటవె సత్యపి విషయ సేవాయాం సమర్థోపి సౌందర్యాదిగుణేషు సత్స్వపి నిద్రాళురివయస్తూష్ణీమాస్తెసముగ్ధః ఏతేషడ్గుణాః యస్యసంతి తస్య శ్రవణద్వారా జ్ఞానసిద్ధి రితిరాద్ధాంతః॥

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్వం యువానం వర్షిష్ఠాంతెవసద్దృషి గణై రావృతం బ్రహ్మనిష్ఠైః । ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తిమీడే॥ భూరంభాంస్య నలోనిలోంబరమహర్నాథోహిమాంశుః పుమానిత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్ట

కం । నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మై ద్విభో స్తస్మై శ్రీగురు మూర్తయె నమ ఇదం శ్రీదక్షిణామూర్తయె॥

నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం। శివ శాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః। కాశీక్షేత్ర నివాస స్య జాహ్నవీచరణోదకం। గురుర్విశ్వేశ్వరస్సాక్షా త్తారకం బ్రహ్మని శ్చితం॥ అజ్ఞానమూల హారణం జన్మకర్మనివారణం। జ్ఞాన వైరాగ్య సి ద్ధ్యర్థం గురుపాదోదకంపిబేత్ । బోధానంద ఘనం నిర స్తసకలం కా రుణ్య పూర్ణేక్షణం మూఢానా ముపదేశకంచ సతతం పాపాత్మనాంపా పహం । వైర్యాగ్యంచ విరాగిణాం సుఖకరం సంపాదకం సర్వదా శ్రీ మద్దేశిక వాసుదేవయతినం మూఢాత్మ కోహంభజె ॥

---

## శ్రీ నారాయణహృదయం.

హరిః ఓమ్ అస్య శ్రీనారాయణ హృదయస్తోత్ర మహామంత్ర స్య, బ్రహ్మఋషి, అనుష్టుప్ఛందః, శ్రీమన్నారాయణో దేవతా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థే జపే వినియోగః.

శ్లో॥ ఓమ్ నారాయణః పరంజ్యోతి । రాత్మానారాయణః పరః,
నారాయణః పరంబ్రహ్మ । నారాయణ నమోస్తుతే.
2 నారాయణః పరోదేవో । ధాతానారాయణః పరః,
నారాయణః పరంధ్యాతా । నారాయణ నమోస్తుతే.
3 నారాయణః పరంధామ। ధ్యానంనారాయణః పరః,
నారాయణః పరోధర్మో । నారాయణ నమోస్తుతే.
4 నారాయణః పరోదేవో । విద్యానారాయణః పరః,
విశ్వం నారాయణస్సాక్షా । న్నారాయణ నమోస్తుతే.
5 నారాయణా ద్విధిర్జాతో । జాతో నారాయణాద్భవః,
జాతో నారాయణాదింద్రో । నారాయణ నమోస్తుతే.
6 రవిర్నారాయణ స్తేజః । చంద్రో నారాయణో మహః,
వహ్నిర్నారాయణ స్సాక్షా । న్నారాయణ నమోస్తుతే.

7 నారాయణ ఉపాస్యస్స్యా ! ద్గురు ర్నారాయణః పరః,
నారాయణః పరోబోధో । నారాయణ నమోస్తుతే.
8 నారాయణః పరంముఖ్యం । సిద్ధిః ర్నారాయణ స్సుఖః,
హరిర్నారాయణశ్శుద్ధిః । నారాయణ నమోస్తుతే.

ఇతి నారాయణహృదయం సమాప్తము.
ఓం తత్ సత్.

---

శ్రీశివ ధ్యానామృతం.

1 నమస్తే నమస్తే మహాదేవశంభో।
నమస్తే నమస్తే ప్రపన్నైకబంధో।
నమస్తే నమస్తే దయాసారసింధో।
నమస్తే నమస్తే నమస్తే మహేశ॥
2 నమస్తే నమస్తే జగజ్జన్మహేతో।
నమస్తే నమస్తే వృషాధీశ కేతో।
నమస్తే నమస్తే మహాపుణ్యసేతో।
నమస్తే నమస్తే నమస్తే మహేశ॥
3 నమస్తే నమస్తే మహామృత్యుహారిన్।
నమస్తే నమస్తే మహాదుఃఖ హారిన్।
నమస్తే నమస్తే మహాపాపహారిన్।
నమస్తే నమస్తే నమస్తే మహేశ॥
4 నమస్తే నమస్తే సదాచంద్రమౌళే।
నమస్తే నమస్తే సదాశూలపాణే।
నమస్తే నమస్తే హ్యాపర్ణైకజానే।
నమస్తే నమస్తే మహాతాపహారిన్॥
5 సర్వదా సర్వ సర్వేశ । సర్వోత్తమ మహేశ్వర।
తవనామా మృతం దివ్యం । జిహ్వాగ్రే మమతిష్ఠతు॥
6 దయాసముద్రాయ నధీశ్వరాయ ।
ధనేశమిత్రాయ సుధామయాయ ॥

కారుణ్యరూపా యమయస్క-రాయ ।
శివాసమేతాయ నమః శివాయ॥

7 వేదాంత వేద్యాయ మహాహ్లాదయాయ ।
కైలాసవాసాయ శివాపధాయ ।
శివస్వరూపాయ సదాశివాయ ।
శివాసమేతాయ నమః శివాయ ॥

8 కుందేందు శఙ్ఖస్ఫటి కోపమాయ ।
మహేశ్వరా యాశ్రితవత్సలాయ ।
శ్రీ నీలకంఠాయ యమాంతకాయ ।
శివాసమేతాయ నమః శివాయ ॥

9 బ్రహ్మేంద్ర విష్ణ్వాది సురార్చితాయ ।
దేవాది దేవాయ దిగంబరాయ ।
అనంతకల్యాణ గుణార్ణవాయ ।
శివాసమేతాయ నమః శివాయ ॥

ఇతి శ్రీ శివధ్యానామృతం

సమాప్తము.



మంగళం.

నాదుబిందాయ బిందునాదాయ - బిందుబీజముసందు
భేదములాయ - బిందుబీజముసందు భేదముదెలిసితే -
సందేహముడిగితే సర్వముతానాయ॥ మంగళం మంగళం ॥
అండపిండమాయ పిండఅండమాయ - అండపిండముసంగు
అనుభవమాయ - అండపిండముసందు అనుభవమెరిగితే
పిండములేదాయ బ్రహ్మాండమాయ॥ మం ॥
యెండగాలిఆయ గాలియండాయ - యెండగాలిమధ్య
కొండలాయ - యెండగాలిమధ్య కొండలుయెక్కితే -
అండసంసారము చెండాలమాయ॥ మం ॥

నక్కకుక్కాయ కుక్కనక్కాయ - నక్కకుక్కలుమధ్య
చుక్కలాయ - నక్కకుక్కలుమధ్య చుక్కలదెలిసితే -
వత్తిలేనిజ్యోతి వెలుగుతానాయ॥ మం॥

సత్తుతానాయ చిత్తుతానాయ - సత్తుచిత్తులోన
సమరసమాయ - సత్తుచిత్తులోన సమరసందెలిసితే -
వత్తిలేనిజ్యోతి వెలుగుతానాయ॥ మం॥

అంగలింగమాయ లింగఅంగమాయ - అంగలింగముసందు
అనుభవమాయ - అంగలింగముసందు అనుభవందెలిసితె -
లింగమెతనువాయ లీలతానాయ॥ మం॥

చూపుతానాయ రూపుతానాయ - చూపురూపులోనే
ప్రాపుతానాయ - చూపురూపులోనే ప్రాపుతామెరిగితే -
పాపాములేదాయ పావనమాయ॥ మం॥

నీవునేనాయ నేనునీవాయ - నీనామర్మము
నిజబోధలాయ - నీనామర్మము నిజబోధలెరిగితే -
మానాభిమానము మరినిల్వదాయ॥ మం॥

క్షరముతానాయ అక్షరముతానాయ - క్షరముఅక్షరములు
శాశ్వతములాయ - క్షరముఅక్షరములు శాశ్వతముదెలిసితే-
అమనస్కారామాయ అంతాతానాయ॥ మం॥

మాయకులోనాయ మాయకుమీదాయ -
మాయ యిరవైఅయిదు మర్మములాయ -
మాయ యిరవై అయిదు మర్మములెరిగితే -
మాయ మాయ మాయ మరియొక్కటాయ॥ మం॥

గురువుశిష్యుడాయ శిష్యుడేగురువాయ - గురుశిష్యులకును
గురుతొక్కటాయ - గురుడుదత్తాత్రేయ హరుడనినమ్మితే -
యెరుకనిత్యమాయ యేమిలేదాయ॥ మంగళం॥ మంగళం॥



